


“యెంకితో తీర్తాని కెల్లాలె”

—చిత్రం : వీరిశెట్టి అచ్యుతరావు.

ప్రత్యేక **త్రిగుణచర్యతో**

గూడియున్న **మెక్లీన్స్**

**పెరాక్సయిడ్** **టూత్‌పేస్టు**



**చాలా బాగుగా**
*** శుభ్రపరచును!**

1 ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'హైపాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే–మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



**చాలా బాగుగా**
*** తెలుపుజేయును!**

2 మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన దాగులను, గారపట్టిన రంగును తొలగించును–అందువల్ల వాటిని మెరిసే టట్లు తెల్లగా జేయును.




*** బాగుగా కాపాడును!**

3 మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని తాజాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజ పరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును

ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

# ★ రాజధాని కబుర్లు ★

చేసుకొని ఎదురుగా ఉన్న భాష్యాన్ని నిరాకరించడం కూడా అంతే పొరపాటు."

పైన పేర్కొనబడిన వాక్యాలన్నీ న్యాయమూర్తి వాక్యాలకుగాని మేజిస్ట్రేటు వాక్యాలకుగాని, యథాతథంగా చేసిన అనువాదాలు కావని, భావాన్ని మాత్రం ప్రతిపాదించేవని ఇక్కడ తెల్పడం న్యాయం.

## బేగంపేటలో పండిట్ నెహ్రూ

కేరళలో అంతా మళయాళంగా ఉన్న పరిస్థితిని చూసి, ఢిల్లీ వెళుతూన్న పండిట్ నెహ్రూ గతవారం బేగంపేట విమానాశ్రయంలో ఒక ఏభైనిముషాలు గడిపారు. 'మేఘదూత- రెండు' ఒకనాటి ఉదయం 11-20 గంటలకు క్రిందకు దిగింది. 12 గం. 10 ని. లకు తిరిగా ఊపుకుంటూ వెళ్ళిపోయింది.

ప్రధాని వస్తున్నాడంటే సామాన్యం కాదుకదా! ఆయన్ని చూడాలని ఎదురు కాపులో కొందరం పడిగాం. ఆయన చూడాలని కొందరు వచ్చారు. అందరం చేరి ఆకాశంవంక చూస్తూ ఆయనరాక నిరీక్షిస్తూ నిలబడ్డాం; కూచున్నాం; కబుర్లు చెప్పుకున్నాం. మనుష్యుల్ని అనుమానపు కళ్ళతో చూస్తూ సి. ఐ. డి వాళ్ళు అక్కడ ఇక్కడ మఫ్టీలో నిలబడ్డారు.

వచ్చినవాళ్ళలో సహజంగా మంత్రులున్నారు: ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి, దేవాదాయశాఖామంత్రి, స్థానిక స్వపరిపాలనాశాఖామంత్రి, విద్యామంత్రి, రెవిన్యూ మంత్రి, శాసనసభాపతి, పరిషత్తుఅధ్యక్షులు ఉన్నారు. అధికారులున్నారు. సమాచారశాఖాధిపతి శ్రీ నరసింగరావు మానిక్, జి. ఎ. డి. ఉపకార్యదర్శి శ్రీ బి.ఆర్. కె. శాస్త్రి, పోలీస్ ఇన్స్పెక్టర్ జనరల్ శ్రీ ఎ. కె. కె. నంబియార్, పోలీస్ కమీషనర్ శ్రీ కల్యాణరావు, డిప్యూటీ కమీషనర్లు శ్రీ ఎస్. వేణుగోపాలరావు, విక్టర్, సహాయ కమీషనర్ శ్రీ డయాస్, ప్రధాన న్యాయమూర్తి శ్రీ పలగాని చంద్రారెడ్డి, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పిడతల రంగారెడ్డి, గవర్నర్ శ్రీ సచార్.

ఇంకా, ఇంకా — మేము!

రాగానే పండిట్జీ మెడలో దండలు వేశారు. గవర్నరు శ్రీ సచార్ మనుమలు కొక్కొక్కరు ఒకొక్క గులాబీ పువ్వు ఇచ్చారు. గవర్నర్ మనుమలు ఇచ్చిన పువ్వులు తీసుకొని నవ్వారు పండిట్ నెహ్రూ. గవర్నర్ మనుమల బుగ్గలు గిల్లి, భుజం తట్టి, పెద్దమనుష్యులం కొందరితో కలిసి 'పెద్దమనుష్యుల గది'—'వి. ఐ. పి. రూమ్'— ప్రవేశించారు.

పెద్దమనుష్యులైనా, మరీ పెద్దమనుష్యుల ముందు చిన్నమనుష్యులైనవారంతా ముఖ్య గదిలో కూలబడ్డారు. పత్రికా ప్రతినిధులంతా గుమికూడి పండిట్ నెహ్రూను ప్రశ్నించడం ఎలా అని ఆలోచించారు. వీళ్ళ గుమిగూడ్డం చూసి స్పెషల్ బ్రాంచి ముఫ్తీ జవాన్లు ఒకరివంక ఒకరు అదోలా చూసుకున్నారు. విమానం దిగ్గానే ముఖ్యమంత్రి 'వీళ్ళు—మన పత్రికలవాళ్ళు' అన్నారు పండిట్జీతో. 'హాయ్!' అని అవ

### రచయితలకు విజ్ఞప్తి

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు, కథలూ, చిత్రాలూ పంపేవారు, అవి మాకు ఉపయోగపడని పక్షంలో త్రిప్పి పంపడానికై వాటితోపాటు స్టాంపులు పంపాలి.

అలా చేయని పక్షంలో ఆయా రచనలను, చిత్రాలనూ తిరిగిపంపడానికి, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికీ అవకాశం ఉండదని మనవి. స్టాంపుల్ను, రచనలతో పాటే పంపడం అవసరం. రచన చివర చిరునామా కూడా స్పష్టంగా వ్రాయగోరుతున్నాము.

కథలూ చిత్రాలూ పరిశీలించి ప్రచురణకు ఉపయోగపడేదీ లేనిదీ నిర్ణయించడానికి కనీసం నాలుగువారాలు పడుతుందని గుర్తించ గోరుతున్నాము.

—సంపాదకుడు.

## కథకాని కథ
### రచనకు నిబంధనలు

ఈ శీర్షికలో ప్రచురణార్థం పంపే రచనలు సాధ్యమైనంత క్లుప్తంగా ఉండాలి. సంఘటనలు యథార్థంగా జరిగినవే అయివుండాలి. ఎవరినీ నొప్పించేవిగా, అవమానించేవిగా ఉండకూడదు. ఉత్తమరచనకు పదిరూపాయలు బహుమతి. రెండవ బహుమతికి అయిదురూ.లు, మూడవబహుమతికి(తగిన రచనవస్తే) మూడు రూ.లు పారితోషికం. బహుమతుల విషయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ప్రచురణకు స్వీకరించని రచనలను తిప్పి పంపటంగాని, రచయితలతో ఉత్తర ప్రత్యుత్తరాలు గాని జరగవు. కనుక రచనలతో పాటు స్టాంపులు పంపరాదని మనవి. రచన పంపే కవరుపై "కథకానికథ" శీర్షికకు అని రాయాలి. అలా రాయనివి పోటీకి స్వీకరించబడవు. ఈ శీర్షిక వారం విడిచి వారం ప్రచురిస్తాము.

లించి, చిటికవేసి, ప్రధాని మరోదిశ నడిచి వెళ్ళిపోయారు.

భోజనం తొందరగాముగించి, కాంగ్రెసు కార్యదర్శి శ్రీ సాదిక్ అలీ పత్రికలవాళ్లతో ప్రసంగించారు. 'ఇంతకు మించి నేనేమీ చెప్పదలచుకోలేదు—' అంటూ చాలా చాలా చెప్పారు శ్రీ సాదిక్ అలీ. ఆయన మాత్రం అనుభవజ్ఞుడైన రాజకీయ శక్తి కాదా యేం? ఆయన వెళ్ళిన తర్వాత పత్రికలవాళ్ళు తాము రాసింది చూసుకున్నారు. ఆయన చెప్పిన 'చాలా చాలా' లో ఏమీ లేదు!

### సాదిక్ అలీ సంగతి

వెళ్ళేటప్పుడు దండలు వేయించుకుని ఢిల్లీ విమానం ఎక్కారు. లోనికివెళ్లారు. ముఖ్యమంత్రి, గవర్నర్ అంతా వెనక్కి నడిచారు. ఈ లోగా శ్రీ సెహ్రావూ రిహ్మన వెనక్కి వచ్చారు. వచ్చి, కేక పెట్టారు. మేమంతా పరుగెత్తాం-మమ్మల్నే పిలిచి ఉంటారనుకుని.

ఆయన విమానంలోకి పోయిచూసే-లోన శ్రీ సాదిక్ అలీ లేరట! శ్రీమతి వీర్ యూసఫ్ వీర తోట, శ్రీ యూసఫ్ వీర తోట కబుర్లలో మునిగి శ్రీ సాదిక్ అలీ ఢిల్లీ ప్రయాణం సంగతే మరచిపోయారు. నవ్వుతూ నిలబడ్డారు శ్రీ సెహ్రావూ. అధికారులు అటూ ఇటూ పరుగెత్తారు. స్కూలుకి వెళ్ళటం మరచిపోయిన కుర్రాడిలా మొహంపెట్టుకొని, సిగ్గుపడుతూ, సాదిక్ అలీ పరుగెత్తుకొచ్చారు. మేఘదూత మేఘాల్లో కలిసిపోయింది. ఎరువుకారు చెప్పకుండాపోతుందేమోనని కారువైపు పరుగెత్తాం మేము.

## కుంభకర్ణుడి పునర్జన్మ: (7)

"సమర్థుడని ఎంచి ప్రభుత్వం నియమించిన శ్రీ కమీషనర్, అనుభవజ్ఞుడని భావించి ప్రజలు ఎన్నుకొన్న శ్రీ మేయర్"-ఈ విధంగా గత రెండుమాసాలలో ప్రస్తావించడం జరిగింది. "ఈ ప్రస్తావనలో ధ్వని కనిపిస్తోంది." [ధ్వని కనిపించడమేమిటి?] అంటున్నారు మిత్రులు కొందరు.

ఆవాక్యాలను ఉపసంహరించుకోబోవడం లేదు. కాని నా అభిప్రాయాన్ని విశదం చేయవలచాను. ధ్వని ధ్వనించినది చాలు. ఇక ధ్వని ధ్వనిసే నిర్లక్ష్యం చేయండి.

ఆటవిక పాలక సంఘంగా నేను అభివర్ణించిన నగరపాలక సంఘానికి రెండుమూడుశాఖలున్నాయి. ఈ రెండుశాఖలు ఎంత భయంకరంగా పనిచేస్తున్నాయంటే సర్వతంత్ర సమర్థుడు అధికారం స్వీకరించినా, పని సాగడంకష్టం. కాదు! అసంభవం. సమర్థులైన వారు పూర్వంకూడా నగరపాలక సంఘ పరిపాలనచేబట్టారు. కాని ఆవలింతలు అంటు వ్యాధివంటివి. అందుకే "వారుమాత్రం ఏం చేస్తారు? కుంభకర్ణుడు గాఢంగా నిద్రపోతున్నాడు" అనడం!

నగరపాలక సంఘం, శ్రీమేయర్ శ్రీకమిషనర్ శ్రద్ధగాపనిచేస్తామంటే పత్రికలు వారి వెనుక నిలబడతాయి. ముఖ్యంగా: ఆంధ్ర పత్రికవారపత్రిక! కాని అత్తవారింటికి వెళ్ళిన కొత్తల్లుడు ఫలహారం తినడంలో చూపించే మొహమాటం నగరపాలకసంఘం పనిలో చూపినంతకాలం విమర్శించకతప్పదు.

నగరపాలకసంఘంలో మూడింట ఇద్దరు ఉద్యోగులు అసమర్థులు. మూడింట ఇద్దరు అవినీతిపరులు. ఈ విషయం అధికారులే ఆమూమాషీ సంభాషణలలో అంగీకరిస్తూ ఉంటారు. వారిపై చర్యతీసుకుంటే-నగరపాలక సంఘ సభ్యులు అడ్డువస్తూంటారని తెలుస్తూంది.

నగరంలో బాటల పరిస్థితి చూస్తే—పారిశుద్ధ్య శాఖ ఎలా పనిచేస్తుందో తెలుస్తోంది. ముందు చెల్లించుకోం టేగాని పాకీవాళ్ళకు కూడా ఉద్యోగం దొరకడంలేదు. అది చెల్లిస్తేగాని ఇళ్ళ ప్లాను అంగీకారం పొందవు సంవత్సరాలు గడిచినా! లైసెన్సింగు శాఖ దారుణాలకు అంతంలేదు. సోదాహరణంగా మనవిచేసుకుంటాను వచ్చే వారాల్లో. ఈనగరపాలక సంఘాన్ని రద్దుచేసి ప్రత్యేకాధికారిని నియమించే యత్నం ప్రభుత్వం చేస్తుంది గాక!

### వెనక్కి తిరిగి చూద్దాం!

ఈ వారం నగరపాలక సంఘం కొంచెం కన్ను తెరిచింది. రెండు వారాల క్రిందట ప్రస్తావించిన చిక్కడ్‌పల్లి-నల్లకుంట చీకటి రహదారిలో లాంతరు స్తంభాలు పడుతున్నాయి ఈవారంలో. కాని పనిలోమాత్రం అత్తారింటికి వెళ్ళిన కొత్తల్లుడి ఫలహారపు మొహమాటం చూపిస్తున్నారు ఉద్యోగులు.

★

# కథ కాని కథ

## వ్యథ కాని వ్యథ
(మొదటి బహుమతి)

ఆ వేళ ఒకటో తారీఖు. జీతం రెండు వందలూ జేబులో వేసుకుని ఏవో కొన వలసినవి ఉండటంచేత బజారుకు బయలు దేరాను. అంత ఆకలిగా లేకపోయినా, ఏదన్నా తిందామని హోటల్లోకి వెళ్ళాను. ఒక వ్యక్తి యాతని దగ్గర్నుంచి నన్ను వెంబడిస్తూ రావటం ఒకకంట చూస్తూనే ఉన్నాను. ఆ వ్యక్తి నాతోపాటు హోటల్లోకి కూడా వచ్చాడు.

టిఫిన్ ఆర్డరు చేశాను. కొనవలసినవి జ్ఞాపకం చేసుకుంటూ, వరాలు చిత్రిస్తూ, తింటూ ఆ వ్యక్తిసంగతే మరిచిపోయాను. కాఫీ తాగిలేచాను. అంతలో ఆ వ్యక్తి నాదగ్గిరికివచ్చి "ఆ పర్సు మీదేనా?" అంటూ నేను లేచిన కుర్చీలో ఉన్న పర్సు చూపించాడు. వెంటనే నా గుండె గుభేలు మంది. పర్సుతీసి భద్రంగా జేబులో పెట్టు కుని ఆ వ్యక్తికి కృతజ్ఞత చెప్పి కౌంటరు దగ్గ రకువెళ్ళి, బిల్లు చెల్లిద్దామని పర్సుతీశాను. కాని దానిలో ఉండవలసిన 200 రూ. లలో 2 మిగిలి రెండు సున్నాలు పోయాయి.

ఇదిచూచి తల తిరిగినంతపనైంది. తల ఎంత తిప్పిచూసినా, ఆ వ్యక్తి ఎక్కడా కనబడలేదు. బిల్లు రెండురూపాయ లయి నందుకు పర్సులో రెండు రూపాయిలే ఉంచిన అదొంగతెలివిని అభినందించాలో అక్కరలేదో తెలియక అయోమయంలో పడ్డాను.

మీసాల సూర్యనారాయణమూర్తి
—రాజమండ్రి.

## గాంధీపద్ధతి
(రెండవ బహుమతి)

కిందటేడు మేము కాచిగూడాలో ఒక మహారాష్ట్రుల యింట్లో అద్దెకుండే వాళ్ళం. ఆ ఇంటివాళ్లూ మేమూ తప్పించి, ఆ యింట్లో ఇంకెవ్వరూ ఉండేవాళ్లు గాదు. ఇంటాయనకూ, ఆయన భార్యకూ తమల పాకులు వేసుకోవటం బాగా అలవాటు. పొద్దస్తమానం అలుముకొద్దస్తూ తమలపాకులు నములుతూ నాలికినిండా ఉమ్మేసేవారు. వాళ్ళకి ఒక వైపున మేము, మరో వైపున వాళ్ళూ ఉండేవాళ్ళు. నోటినిండా ఉమ్మి యుండటంవలన వాళ్ళ భాష్యంగా తమకూర ముతోకరూపంలా ఉండేది. మేము యింట్లో ప్రవేశించిన తరువాత వారం రోజులవరకు నాకిట్లో ఉమ్మియ్యకూడదని భార్యాభర్త లిద్దరికీ పదే పదే చెప్పాను. చెప్పినప్పుడు తథాస్తనేవారేగాని ఉమ్మియ్యటం మాత్రం మానలేదు. నాకూ చెప్పి చెప్పి విసుగేసింది. ఇల్లు మారుద్దామన్నా, వెంటనే మరో ఇల్లు దొరకటం కష్టం.

ఓ రోజు సాయంత్రం ఈ విషయం గురించే ఆలోచిస్తూ కూర్చున్నప్పుడు ఓ ఆలోచన తట్టింది. వెంటనే బజారుకెళ్ళి అల్యూమినియం పాత్ర ఒకటి కొని తెచ్చి పెట్టాను.

మర్నాడు ఉదయమే లేచి "యింటివా ళ్ళెప్పుడు ఉమ్మయడానికి వస్తారా" ని అల్యూమినియంపాత్ర పట్టుకుకూచున్నాను. ఇంతలో ఇంటి యజమాని ఉమ్మియడాని కని నాకిటి దగ్గరకు వచ్చాడు. నేను వెంటనే ఆయన ముందుకు దూకి అల్యూమినియం పాత్రను, 'ఇందులో ఉమ్మియండి' అన్నట్లుగా ఆయన మొహంముందు పట్టుకున్నాను. ఆయనపాపం సిగ్గుతో తలవాల్చుకుని ఉమ్మకుండా వెనుదిరిగిపోయాడు. మా అదృష్టంకొద్దీ యింటి యజమానురాలు ఉమ్మియడానికి వచ్చినప్పుడు నే చేసినట్టే చేసింది. ఇలా నాలుగైదు సార్లయ్యేసరికి వాళ్లిద్దరూ నాకిట్లో ఉమ్మియ్యటం పూర్తిగా మానుకున్నారు. గాంధీగారు చెప్పిన పద్ధతి నవలంబించడంవలన ఆ యింట్లో ఉన్న అయిదుమాసాలు సుఖంగా గడిచిపోయినవి.

భాగవతుల విశ్వనాథరావు
—హైదరాబాదు.

## జీవితం సముద్రం లాంటిది
(మూడవ బహుమతి)

రెండేళ్ళక్రితం వర్షా కాలంలోనే శాస్త్రి తనపుట్టిన రోజున మిత్రులు పది మందికి పార్టీ యిచ్చాడు. తరవాత అందరం కలిసి బీచ్‌కి వెళ్ళాం. "కోస్టల్ బ్యాటరీ" నుంచి "హ్యాండెల్ పాయింట్" దాకా నడిచాం పాడిఇసుకలో. 'పాడిసరదా తీరింది-తడి,' అన్నాను మాలో చాలామంది. జోళ్ళు పొడి యిసుకమీద విడిచి తడిమీదికి నడిచాము. శాస్త్రీ బలేహుషారుగా కబుర్లు చెప్తున్నాడు. వాడు జోళ్ళు విడువలేదు-బూట్లతోపాటు కెరటాలవేపు నడుస్తున్నాడు. కాళ్ళు తడుపుకుందామని సరదాపడ్డారు మనవాళ్ళు. సరే అని జోళ్ళు అక్కడే ఊడ్చి, ప్యాంటు పద్దుకున్నాడు పదిమందితో పాటుగా శాస్త్రీ.

ముందుకు నడిచేకొద్దీ ఎగురొచ్చి ఆహ్వానిస్తున్నాయి అలలు. ఒకే సరదాగా ఉంది. ఆ ముచ్చటలో ఓ పెద్దకెరటం - అంతెత్తున లేచి - మా చొక్కాలు సగంసగం తడి పింది. పొట్టి కిష్టారావుకయితే జేబులో నోట్లు కూడా తడిసిపోయాయి. కొందరం నవ్వుకున్నాము. కొందరు కెవ్వుమన్నారు. దూరంగా కూచున్న యూనివర్సిటీ అమ్మా యిలు మా అవస్థచూసి నవ్వారు.

ఇంతలో "ఇంకో చెప్పేదిరోయ్" అని గోలపెడుతున్నాడు శాస్త్రీ. మేమంతా జోళ్ళు తొడిగేసుకొన్నాం. వాడుమాత్రం రెండో చెప్పుకోసం వెతుకుతున్నాడు. ఎక్కడ దొరుకుతుంది! ఆ పెద్దకెరటం కాజేసి ఉంటుంది. ఒక చెప్పు వదిలి రెండో చెప్పుని ఎగరేసుకు పోయింది.

ఒళ్ళు మండిపోయింది శాస్త్రీకి. వెంటనే చెప్పుతీశాడు పైకి. కోపంగా బలంకొద్దీ - దూరంగా విసిరేశాడు సముద్రంలోకి. దానికే 'శకదలిం'దన్నాడు. "సర్వంద్రా- ఇప్పుడు నవ్వుకోండి" అన్నాడు ముంగ మొఖంపెట్టి. ఇంతట్లో ఇంకో పెద్దకెరటం వచ్చి మా కాళ్ళు తడిశాయి. కాస్తం కాలికి దొరికిందిట. "ఇదిగోరా నీ చెప్పు" అన్నాను. కెరటం ఇందాక ఎత్తుకుపోయిన చెప్పునితెచ్చి గట్టుమీద వదిలేసింది. ఇక మనవాడిముఖం చూడాలి.

"గోపాల"-విశాఖపట్నం.

★

# బాల్య సహజం

**వాడ్రేవు పతంజలి**




పక్క చెవులుపడిపోయిన పాలుగాయిదు పుస్తకాలూ, పాదిలాగ మినుకుమిట్లుపడుతూన్న దీపంముందు వేసుకుని, మధ్యమధ్య పెద్దగా ఆవులిస్తూ, తెరలు తెరలుగా ముంచుకువచ్చే నిద్రను కప్పిపుచ్చే భగీరథ యత్నంలో, ఇంచుమించు ఒకో వాక్యానికి పైపెంకు ఒక్కొక్కటి లేచిపోయేట్టు కూనిం చదువుతున్నాడు, పెద్దాడు.

"ఘనతవహించిన అక్బరు మొగలాయీ చక్రవర్తులలో ఆఖరివాడు..."

'ఒరే వెధవా. సరిగా చూసి చదువ్. నానా కాలపు చదువూ, నువ్వూ!' అందామనుకున్నా... కాని [illegible] గొంతులోనే గిరగిరా తిరిగి, యథాప్రకారం చేసిన టకతో లోపలికిపోయాయి.

'ఎందుకి తను వాడిని అంతగ్గవాడు కాదూ!' యేం ప్రశ్నకి ఇలాంటి ప్రశ్న ఉదయించి దానికి అసలు అవకాశం లేదు. అయినా ఇదే ప్రశ్న గతంలో తను వాయిగయిదుసార్లు వేధించింది. ఏం వాళ్లకి నిజంలో, పెండ్లిదంలో ఆమెకెంత భాగ్యతనుంతో అంతకంతా తగ్గుతుంది మరి!

స్కూలు విడుగంటలకయినా వాడు ఎనిమిదింటికి గాని పక్క దిగడు. వాణ్ణి లేపడానికి తనేమీ ప్రయత్నించరాదు. పడిక్ష విధిత, అంతకానికని పట్టుకెళ్ళిన డబ్బు పిడికి, వాడికి, ఎగడవడిగో సుక్క పెట్టి, స్కూల్లో పేగుకోటే స్తే విధులనంటి కొర్లు కొట్టి, సరిగ్గా స్కూలు విడిచే వేళకి ఇంటికి దొక్కుతున్నా, అదివహం తనకు ఎలాగో తెలిసినా, "ఏదిరా, వెధవా..." అనేందుకు లేదు.

బోటు పెట్టెలోనుంచి అర్ధరూపాయికోసం కాజేసి, అమ్మ లేబులు తిడుతుందేమోనని, దాన్ని మందం పట్టెలో దూర్చి, ఆతర్వాత అది కనపడక పట్టెంతా సగానికి పైగా తొడగోసిన ప్రబుద్ధుణ్ణి చూసి తను పళ్లు పటపట కొరికింపబోతే ఆమె తనతో రెండు పూర్తి రోజులు మాట్లాడటం మానేసింది.

ఏమిటిదీ? ఆమెకి ఎలా, ఎప్పుడు అతిలువు కలిగిందో ఏమోగాని, తనకి వాడంటే కిట్టదట. అందుకని ఆ బంగారంగాణ్ణి, ఆమెరీతి కొడుకుని తను ఎప్పుడూ ఆడిపోసుకుంటాడట! వాణ్ణి చూస్తే తన కళ్లల్లో నిప్పులు పోసుకుంటాడట.

'ఫలానా, ఫలానావారి అబ్బాయి, అల్లా ఇలా ఉంటాడట. తల్లి తండ్రీ అమాత్రం కుర్రాడికి బుద్ధిచెప్పుకోరూ!...అయినా అంత గారమెందుకో వాళ్ళకి! లేక లేక పుట్టాడనా, ఏకైక సంతానమనా!-' అని పొరుగువాళ్ళు వెక్కిరిస్తూ అనుకుంటారు. ఏం-అనుకోరూ! మన బంగారం మంచిది కాకపోతే ఎవర్ని అని ఏం ప్రయోజనం!

పిడట్ల, పెరిగి పెద్దవాడయి, ఆమెకూ, తనకూ మొత్తం కుటుంబానికీ, వంశానికీ పేరూ, ప్రతిష్ఠా విడివిడిగా సంపాదించి పెడతాడట. అలాంటి వాణ్ణి, ఇంటికి పెద్ద కొడుకుని, అంత నిర్లక్ష్యంగా చూడకూడదట. పిల్లల ఆటా, పాటా మానిపించి ఇంటో కుదేయటం తనుకూడా నేర్చుకోవాలట.

ఎంత బాగుంది!

వాడంటే ఈ ఉక్రోషం తన కొక్కడికే కాదట. ఆయన పేరుపెట్టినా, అదేమిటో మామగారికి (తన తండ్రి) కూడా వాడంటే పోతిగా కిట్టదట. వాడు బుద్ధిగా స్కూలుకు పోతూంటే వాడితో ముద్దిచ్చి సంతోషించడం పోయి, 'వెధవ, పిడికి చదువేమిటి? ఏరా ఇప్పుడే చదువుకుంటు వస్తావా, స్కూలు నుంచి' అంటారట. వాడు ఇక్కడ పుస్తకం తీసి అక్కడ పెట్టబోతే 'వద్దు. నీకు పుస్తకాలెందుకురా? అక్కడే పెట్టు చింపి తగలెయ్యక:' అంటారట రెండో వాణ్ణి ముద్దులాడుతూ పెద్దాడిని పోఅదలికోళ్ళి అడుగో. నీకు చెయ్యి తిన్నగా ఉంచడు.' అంటారట. ఆమాట విన్నప్పుడల్లా తనెంతో బాధపడుతుందట, కళ్ళనీళ్ళ పర్యంతం అవుతుందట.

అలాగని ఆమె ఎప్పుడూ వాడి ఒంటిమీద చెయ్యి వేసి ఎరగదని కాదు. ఇందుకో, అందుకో ఎందుకో ఒకందుకు తరచు వాడికి పళ్లు వాచిపోతూనే ఉంటుంది. వాణ్ణి నిక్కి గదిలోనికి తోసి పైన గొళ్ళాలు పడుతూనే

# ★ బాల్య సహజం ★

ఉంటాయి. దెబ్బలుతిని వెక్కి వెక్కి ఏడుస్తున్న వాణ్ణి చూసి జాలిపడి నేనయినా దగ్గరకు తీస్తానుగాని, అప్పుడు ఆమె మాత్రం వాణ్ణి ఓ పురుగుని చూసినట్టు చూస్తుంది. వాడి మూలాన తనకి సుఖం లేకుండా పోయిందంటుంది.

పదిమందిచేత వేలుపెట్టి చూపించుకొనే కొడుకుని కనడంకన్న తాను గొడ్రాలుగా ఉండిపోయినా బాగుండే దంటుంది. వాడు ఏదో అయిపోయినా తనకు హాయిగా ఉండే దంటుంది.

తల్లి గారాబము తన ఉక్రోషము, తాత అనిష్టతా అలావుంచి, వీడు ఏమవుతాడు? పెరిగి, పెద్దవాడయి ఎందుకయినా పనికి వస్తాడా? ఇప్పటి లెక్కలనిబట్టి చూస్తే పక్కీ జులాయిగా తయారయి, ఏ రౌడి గుంపులోకో చేరిపోతే......ఈ ఆలోచన తన హృదయాన్ని కలచివేసింది. తన పెద్దకొడుకు రౌడీ అయిపోతాడా? వాడికి అయిదారేళ్ళు వచ్చేవరకు, వాణ్ణివిడిచి ఒక్క క్షణం ఉండ లేక పోయేవాడు తను. ఆమె పుట్టింటికి వెళ్ళి నప్పుడు ఆమె చెంతలేని బాధకన్న, వాడు దూరంగా ఉన్నాడనే బాధే తనను క్రుంగ దీసేది? డాబామీద వెన్నెలలో మంచం వేసుకొని వాణ్ణి తన గుండెలమీద పడుకోబెట్టుకొని తను ఎన్ని కథలు చెప్పేవాడని ఎన్ని పాటలు తనుపాడి, వాడిచేత పాడించే వాడని!

వాణ్ణి అలా జోకొడుతూ—వాడు పెద్ద వాడయి మరీ పెద్ద ఉద్యోగం చేస్తూ తననూ, తల్లినీ పువ్వుల్లో పెట్టిచూసుకుంటున్నట్టు... 'సరేవాణ్ణి పక్కలో బెట్టమంటే అలావదిలేసి, మీరు నిద్రపోతున్నారా? బోలెడు పనుంది కొంచెం పట్టుకోండి' అనే ఆమెమాటలు విని ఈలోకంలో పడిన సందర్భాలు తనకు జ్ఞాపకంవచ్చి కళ్లు చెమ్మగిల్లాయి. పని తొందరలో ఆమె వాడిమీద విసుక్కుంటే, అది తీవ్రంగా తీసుకొని, అభోజనంవుండి ఆఫీసుకు వెళ్ళిపోయిన సందర్భాలున్నాయి. వాడికి కొత్తపళ్లు వచ్చుతుంటే, వాడి మంచం చుట్టు కాలుకాలిన పిల్లిలా తిరిగి మనసు పాడుచేసుకునేవాడు తను.

అల్లాంటి తను పసివాడు ఏదో అల్లరిచేస్తే దాన్ని రాద్ధాంతంచేసి, చిలవలు పలవలుగా ఆలోచించుకుని వికలమనస్కుడవుతున్నాడు. తను ఇలా మారిపోతున్నాడేమిటి? అసలు ఒకప్పటి తనకీ, వర్తమానంలోని తనకీ ఏమయినా మార్పు ఉందా? ఏమో! వయస్సుతోబాటు బుద్ధులూ మారుతాయి. అయితే తనబుద్ధులు తన సొంతబిడ్డని అసహ్యించుకొనే లాగు, ద్వేషించేలాగు మారాయా?

అజాగ్రత్తిగా తీస్తే ఏ వస్తువయినా పాడవుతుంది. నిజమే! ఆ విషయం పెద్దవాడయిన తనకు తెలుసును. పదేళ్ళ కుర్రవాడికి తెలుసునా? ముప్ఫయి ఏళ్ళు దాటిన నాన్న ఆలోచించినట్టు పదేళ్ళ కొడుకు ఊహించగలడా? పెద్దవాడు తనకి, వాడికీ పోలికేమిటి? మరి పిల్లలంతా అలాగే ఉంటారేమో? తనకి తెలిసినవాళ్ళ పిల్లలెవరూ ఇంత అల్లరి చేస్తున్నట్టు లేదే? తనకేం తెలుసు? వాళ్ళుకూడా ఎప్పుడైనా తమ

పిల్లలగురించి చెప్పాలిసివస్తే ఇలాగే అంటారేమో!

వాడి తరవాతి వాళ్లు అంతచేసి అల్లరి చేయరేమరి? వాళ్ల వయసెంత? ఈ వయస్సు వచ్చేసరికి వాళ్ళూ ఇలాగే తయారవుతారేమో? అదికాక కొందరు పిల్లలు సహజంగా చలాకీగా ఉంటారు; కొందరు జిజ్జుగా ఉంటారు. తనకంటె తన తమ్ముళ్లు చలాకీగా ఉంటారని అమ్మ అంటూండడం తనకి ఇంకా గుర్తువుంది.

'తన పెద్ద కొడుకు — రౌడీ' ఈ ఆలోచన తను సహించుకోలేకపోయాడు. గుండెలు అవిసిపోతున్నట్టు అనిపించింది. తన ఆశలు, తన కలలు ఏంగాను? 'ఆ రౌడీ వెంకట ఫలానావారి అబ్బాయిటగా!' అని ఊళ్ళోవాళ్ళంతా కాకై అరుస్తుంటే తను తలెత్తుకుని తిరగగలడా? అసలు అంత భయంకరమైన ఆలోచన తనకెలా కలిగిందో బోధపడలేదు. మనసు ఎప్పుడూ అయిన వాటికీ కీడు శంకిస్తుందట. పోనీ. ఇప్పుడే ఏ మదనపల్లి స్కూలుకో పంపించేస్తే...ఆమెనెలా సమాధానపరచడం?

"ఇలా వదిలేస్తే పెద్దవాడు రౌడీల్లో కలిసిపోతాడు"—అని తను అనగలడా? అంటే ఆమె మాత్రం ఎలా సహించుకుంటుంది? ఇప్పటికే పాపం అంతా తననే వాణ్ణి ఆడిపోసుకుంటున్నారని ఎంతో బాధపడుతోందే...

"మీవాణ్ని ఎక్కడో మదనపల్లి పంపించేటంత అవసరమేమొచ్చిందండీ?" అని పొరుగింటావిడ అడిగితే ఆమె ఏం సమాధానం చెప్పగలుగుతుంది? అసలు వాణ్ణి వేగా మదనపల్లిలాంటి స్కూలుకిపంపి, నెలనెలా వాడికి అవసరమయ్యే డబ్బుపంపగలస్తోమతు తనకి ఉందా? ఆలోచన ఆ వైపు మళ్ళేసరికి తనకి మరింత బాధ కలిగింది, ఈ మధ్య ఎప్పుడయినా వాళ్ళకి చక్కని బట్టలు కుట్టించాడా? ఎప్పుడయినా ఓ బిస్కెట్ పాకెట్ కొని తెచ్చాడా? ఎలా తేగలడు, తను మాత్రం? నెల పొడుగునా చేసిన అప్పులు తీర్చడంతో జీతం కాస్తా హుళక్కి అయిపోతే, ఇల్లు గడవడానికే స్నేహితుల్ని 'దేహీ' అంటూన్న తను ఇక పిల్లల బాగు ఏం చూడగలడూ? ఎప్పుడూ పరిస్థితులు మెరుగ రూనకి.

* * *

"తాతా, తాతా! అమ్మ పిలుస్తోంది. అన్నం పెట్టిందిట" పొట్టమీద కూర్చుని ఎనిమిదేళ్ల మనవడు తనను లేపాడు. చిట్టి మనవడు చేయూతనిచ్చి పాతాళంనించి తనను పైకి లేవదీసినట్టనిపించింది తనకి.

తన పెద్దాడు ఇప్పుడు ముప్ఫయిరెండేళ్ళవాడు. చక్కగా ఉద్యోగం చేసుకుంటున్నాడు. పెద్దాడి దగ్గర ఉంటూన్న తనకి, మనవణ్ణి, పొట్టమీద ఎక్కించుకుని ఆటలాడిస్తూ, అవకాశం దొరికితే "కృష్ణా, రామా" అనుకుంటూండడమే కాలక్షేపం. కొడుకు విపరీతమైన అల్లరి చేస్తాడని చిరంజీవి సౌభాగ్యవతి కోడలికి కోపం అంతా ఇంతా కాదు. నీటికీ, మాటికి వాణ్ణి పట్టుకుని తెగ బాదుతుంది.

"వాణ్ణికొడితే నామీద ఒట్టే" అంటాడు పెద్దాడు.

"అల్లరి చేయడం పిల్లల సహజలక్షణం. అంతమాత్రాన వాళ్లు చెడిపోతారనుకోకమ్మా!" అంటాడు తను గతాన్ని నెమరు వేసుకుంటూ, తనలోతాను నవ్వుకుంటూ!

★

పనిలేని పెద్దమనిషి తీరికగా కూర్చుని పాలవాడితో ఇలా అన్నాడు. "ఆవుకీ, పాలవాడికీ ఒక్కటే తేడా. ఆవు కేవలం కల్తీలేని పాలు ఇస్తుంది."

వెంటనే పాలవాడు అందుకుని "అంతేకాదు మరొక్కటి కూడా ఉంది బాబయ్యా, పాలవాడు అప్పుపెడతాడు ఆవు పెట్టదు—" అన్నాడు తాపీగా.

# బుకానంద లహరి

## ముళ్ళపూడి వెంకటరమణ

బాలకిరణాలతో లోకాన్ని జోకొడుతున్న చంద్రుడు, అరుణ కిరణాను కను మాపుమేరలో కానరాగానే తెల్లబోయి పాలిపోయాడు. రాత్రి తెల్లవారి, పేటు తిరిగేసి ఎర్రబారబోయింది. అప్పులు తీర్చేసిన వాడి మనసులా లోకం ప్రశాంతంగా ఉంది. గాలి చల్లగా మెల్లగా వీస్తోంది. ఉషాదేవి తనలో ఉండీ ఉండీ నవ్వుకుంటోంది. పువ్వులు మెల్లిగా మేలుకొంటున్నాయి. తొలిసారిగ వికసిస్తున్న మొగ్గలు పటపగా లేకుండా మొదటిరోజున అక్కయ్యచీర కట్టుకొన్న కన్నెపిల్లలా ఉన్నవోంసే పరవళ్ళు తొక్కుతోన్నాయి. పక్షులు వస్తే కొచ్చిన పాటలన్నీ పాడేస్తున్నాయి; కవులు నిరుత్సాహపడకుండా కాఫీపాడిఅప్పారోరికి దాకా ఆయనా పిల్లలూ నిద్రలేవకూడదని ఆవిడ ఆశపడుతోంది. అప్పులు ఇచ్చుకొన్న వాళ్ళు తెల్లవారుతోందని ఉప్పొంగి పోతున్నారు నిద్రలోనే; అప్పు తెచ్చుకున్న వాళ్లు ఉప్పొంగి పోవటం లేదు గది అనతలికి.

యజమాని అడుగుల చప్పుడువిన్నా, రానీచూదాం అని కూర్చున్న సేవకుడిలా మొత్తంమీద జగతి ఇంకా తటపటాయిస్తోంది డ్యూటీలో పడదామా కాస్సేపు ఆగుదామా అని. సూర్యభగవానుడికి కోపం వచ్చింది. చాలాకాలం తరవాత, రావలసిన డబ్బు చేతికిరాగానే అప్పులవాళ్ళ మొహాన విసిరికొట్టేవాడిలా ఆయన దూకుడుగా కిరణాలను గుప్పించేస్తున్నాడు. చిక్కటి మర్రిచెట్టుమీద కొమ్మ తొట్టి మధ్య కట్టినగూట్లోకి ఓ కిరణంపడి పిల్లకి గుచ్చుకుంది. అది మెల్లిగా ఓ కన్ను సగం తెరిచి చూసి ఓహో తెల్లవారిందనుకుని ఆవులించి లేత రెక్కలు బద్ధకంగా విరుచుకుని నోరు తెరుచుకుని అలాగే పడుకుంది. నోట్లో ఏమీ పడక పోయేసరికి ఆకలోయ్ అంది.

'ఉష్ కాకీ! ఏవిటా కావుకేకలు అప్పుడే ఇలా" అంది తండ్రి కాకి. పిల్ల కన్ను తెరిచి చూసింది. తల్లీ తండ్రీ చూడుపక్కనే కొమ్మమీదకూర్చుని దానికోసమే శ్రద్ధగా చూస్తున్నారు. మంచి పురుగులు కాబోసు అనుకుంది పిల్ల.

'అదుగో వచ్చేస్తున్నాయి. చూడు. అయిందా పెళ్లి! నే చెప్పలే?" అంది తల్లి కాకి.

"పొద్దుటే పరగడుపుని ఆమాటెంగుకు మళ్లీ! నువ్వూ నీ అలంకారాలూను" అని విసుక్కుని మళ్లీ కిందికి చూశాడు.

అతనిమాట, రెక్కలో బాణంలా గుచ్చుకుంది. ఆమె నొచ్చుకుంది.

* * *

చెట్టుకింద పెద్దపుట్టదగ్గర చాలాసందడిగా ఉంది. మూడుగోజుల నాడు పుట్ట ఖాళీ అయినప్పటినించీ మళ్ళీ ఎవరొస్తారా ఎలాటి పాము దిగుతుందా అని కంగారు పడుతున్నాయి కాకులు రెండూను.

క్రితం రోజు మధ్యాహ్నం ఓడజను చీమలువచ్చి వెళ్లాయి. సంజవేళ కాకీ కాకీ బాకీగురించి తగవులాడుకుంటున్న అలికిడి అయి చూస్తే, అయిదారు గుంపుల చీమలు కనిపించాయి. అవి పుట్టలోనికి వెళ్ళి వాటాలూ, గాలివాలూ, చెట్టునీడా, వానా వరదల తాకిడీ అన్నీ కాకాలూ చూసుకున్నాయి. ఇవతలికివచ్చి అన్నీ కూడబలుక్కున్నాయి. వాటిలో ఓడజను చీమల్ని మిగతావన్నీ కుచ్చి కుచ్చి అడుగుతున్నాయి.

వెర్రి ముంకలు అనుకుంది ఆడకాకి... తీరా ఇందాక తెల్లవారేసరికి చూస్తే సుమారు ఎనిమిది లక్షల చీమలు సంభారాలూ అన్నీ పట్టుకుని తరలి వచ్చేస్తున్నాయి.

కాకమ్మ విరగబడినవ్వింది. "చూడు చూడు. ఇకాసేపటికి సుబ్బన్న, నాగలక్ష్మి వచ్చేస్తారు. ఇవన్నీ ఏంకనుటా అప్పుడూ ...పరిగెడతాయి పాలోమని." అంది.

"అవెక్కడోస్తాయిలే. ఆ పాములాడు ఈపాటికి నాగమ్మనికూడా పట్టి బుట్టలో వేసుంటాడు."

కాదంది కాకమ్మ.

మాటలోనే దూరంగా సుబ్బన్నా, నాగలక్ష్మి చరచరా వచ్చేస్తున్నారు. సరసాలు ఆడుకుంటూ బుసా బుసామంటూ.

మందార మొక్కదగ్గర నిలబడ్డ లేడిపిల్ల ఒకటి ఆలోచిస్తోంది 'ఈ ఆకులు బావుంటాయా' అని.

కొంటె సుబ్బన్న పోతూ పోతూ అటు తిరిగి బుస్సు మన్నాడు. లేడిపిల్ల ఉలికిపడి చూసి నవ్విందికాని పరిగెత్తలేదు.

నాగలక్ష్మి హేళనగా నవ్వింది. "చూశావా. లేడా తెలిసిపోతూంటేనే..." అంటూ తనోసారి బుస్సుమంది. లేడి మందారాకుల రుచి సమస్య పరిష్కారం అర్జెంటుగా వాయిదావేసి వాళ్లమ్మని

"కోరలు పీకేశారు కాబోలు పాపం సుబ్బన్నకి" అంది కాకమ్మ జాలిగా.

కాకరాజు మాట్లాడలేదు. జరగబోయేకథ తల్చుకుంటే అతనికి గుండెగుభేలుమంటోంది.

ఉత్సాహంగా ఆడుతూ పాడుతూ వచ్చిన సుబ్బన్న, నాగలక్ష్మి పుటదగ్గిరికి రానే వచ్చారు. వచ్చినవారల్లా, అలా కొంపపల్లి బొమ్మపాముల్లా కొయ్యబారి పోయారు—తమ పుట్టకి పట్టినగతి చూడగానే.

పుట్టగుమ్మాలనిండా, గోడలనిండా లక్షోపలక్షల చీమలు, చాలా హడావుడిగా సందడిగా తిరుగుతున్నాయి. ఐదారు పెద్దచీమలు ఉత్తర్వులు వేస్తున్నాయి. పిల్లల్ని ఒకగంతలోంచి, బియ్యపుగింజల్ని ఇంకో గుమ్మంలోంచీ పంపిస్తున్నాయి. మరోదారివెంట కొన్నిచీమలు పుట్టమట్టిని పట్టుకెళ్తున్నాయి లోపల గదులుకట్టడానికి.

సుబ్బన్నకి కోపంవచ్చింది. "ఏమిటీ ఒఘాయిత్యం! ఏమిటీ దౌర్జన్యం. ఘోరం. దారుణం. దోపిడీ" అనుకుని పడగెత్తి బుస్సుమనబోయాడు.

"ష్. వద్దొద్దు. నామాట విను. పరువు పోతుంది" అంటూ నాగలక్ష్మి బుసకొట్టి, మాటతూలినందుకున్నిందనుకుంటూ మెంగుడి వంకచూసి నాలికలు కొరుక్కుని తల వంచుకుంది. చీమలన్నీ గజగజలాడి ఎక్కడివక్కడె స్తంభించిపోయాయి. సింహద్వారం దగ్గిర ఒక చీమంతి చుట్టాలకి కులాసాగా కబుర్లు చెబుతున్న మంత్రి కారంతా ఆ పిల్ల చేసిన ఒక జోక్కు చిరుచిరు నవ్వబోయి మానేయడంకూడా సంభవమైంది!

సుబ్బన్నా, నాగలక్ష్మి పుట్టకి కొంచెం దగ్గరగాదాకి ఆగి పడగలెత్తి సర్పదర్పాన్ని అభినయించారు.

ఫాజా ఫోటో రెడీ గానే ఉంది అన్నాడొక చీమంతుడు. చుట్టు ఉన్న వాళ్లంతా పగలబడి నవ్వారు.

బుస్సు మంది నాగలక్ష్మి.

ఉష్ తప్పు అని మందలించింది పెద్ద చీమ. తరవాత ముందు కొచ్చి గుమ్మం దగ్గిర గుట్టమీద నిలబడి 'ఎవరు మీరు ఏం కావాలి' అంది కటిగా.

'చెప్పుకోండి చూదాం' అంది నాగలక్ష్మి ఎటకారంగా.

(47-వ పేజీ చూడండి)






డేంజర్ జోన్

## పొగరాష్ట్ర

"సిగరెట్లు చాలా ప్రమాదం. మారు వేషం వేసుకున్న విలన్‌లు అవి. తియ్య, కొన్నరు తెచ్చికొంపముంచేస్తాయి." అని ఉండుండి సాలుకో సారి ఒక ప్రకటన చేసు ఉంటారు కొందరుశాస్త్రజ్ఞులు.

"గిట్టని, వాళ్ళ మాట నమ్మి మోస పోకండి. అసలు సిగరెట్టంత మంచివస్తువు మరోవాటి లేగు" అంటారు 'గిట్టిన' వాళ్ళ తాలూకు పరిశోధకులు పై హెచ్చరికకు జవాబుగా.

"సిగరెట్ నిండా టిన్నులకొద్దీ నికొటిన్ ఉంది. ఒక్క చుక్క పిల్లి నాలుకపై వేసి చూడుడు అది ఎలా చచ్చిపోతుందో—" అంటాడు సిగరోషు మతసుడు.

"పాపం పిల్లి నాలికమీద నికొటిన చుక్క వేసే పాపపు బుద్ధిమనకేల?" అంటాడు సిగరెట్లని తిట్టిపోసే వారి పొగరెట్లా అణచాలో తెలిసిన వోడ్ హకాస్.

అది కాదు. సిగరెట్టు చెడ్డగకాని, చుట మహామంచిది. సిగరెట్లు వదలలేని వారికి, చుటపొగాకునే సిగరెట్టుగా చుట్టి ఇస్తే సరి అన్నారు మొన్న కొందరు శాస్త్రజ్ఞులు.

అయితే, సిగరెట్టైనా కొంతవరకూ సగంవరకూ మంగిపే, మరీ చివరంటా కాలిస్తేనే నికొటిను, ఇతర మత్తు, విష ద్రవాలూ వేడికి ఆవిరిఅయిలోపలికివెళ్తాయి. అంగుళల $1\frac{7}{8}$ అంగుళాల మేర ఉందనగా పారేస్తే ఏమీ ప్రమాదం లేదు అంటూ స్వీడన్‌లో సిగరెట్ల కంపెనీ ఒకటి గతవారం శాస్త్రజ్ఞులచేత నిర్ధారణ చేయించింది. 'కింగ్ సైజ్ డ్' (మామూలు వాటికన్న కాస పొడుగు) సిగరెట్లు ఇలా చివరకంటా కాలిస్తే, మామూలు వాటికన్న ఎక్కువ ప్రమాదం ఉందని కూడా హెచ్చరిక చేసింది. బొమ్మలో గీత డేంజర్ జోన్.

చివరకి,కాని కాల్చేవాళ్ళ తీర్పుమటుకు ఈ విధంగా వెలువడింది: 'పచ్చి దొంగలు ఇవో సంటు సగం సగం కాల్చి పారేస్తే మరి రెండు రెట్లు సిగరెట్లు కొంటామని ఈ ఎత్తు, అన్నారు వారంతా తెలివిగా.

యుద్ధం మటుకుయధాప్రకారంసాగుతోంది.

## మంచి మంచం

విదుమ్మప్పావు పౌనుల బరువుతో తేమిల్చి తయారుచేసిన అల్యూమినియం మంచం ఒకటి టూర్ల మీద తిరిగేవారికి సదుపాయంగా కనిపిస్తోంది. అమెరికాలో ఇటీవల తయారుచేసిన ఈ నమూనా మంచం ఎత్తు 8 అంగుళాలు. బారు అరడుగులు. వెడల్పు 25 అంగుళాలు. పడుకుని లేచాక, పరుపులా చుట్టబెట్టి చంకన పెట్టుకు చక్కా పోవచ్చు.

## టెలిఫోన్‌కు టెలిఫోన్

శబ్దగ్రహణశక్తి తక్కువైనవారూ, దాదాపుగా చెవుడు వచ్చినవారూ కూడా టెలిఫోన్‌లో మాట్లాడినపుడు అవతలిమనిషి అరవకుండానే అతనిమాట స్పష్టంగా వినడానికి ఒకసదుపాయం వచ్చింది. స్థూలంగా ఇది లౌడ్‌స్పీకర్ అన్నమాటే. దీనిని టెలిఫోన్ రిసీవర్ కప్‌కు అమరుస్తారు. దీనివల్ల



టెలిఫోన్

శబ్దం 49 డెసిబెల్స్‌వరకూ పెరుగుతుంది. అవసరాన్నిబట్టి వాల్యూమ్ సర్దుకోవచ్చు. అక్కరలేదంటే తీసివేయవచ్చు.

## రోజులు మారాయి

(యుద్ధ) కాలంనాడు, 'పగవాడు' దండెత్తివస్తున్నాడూ అనేసరికి జనం చెన్నపట్నాలూ, విశాపట్నాలూ వదలి పల్లెలకు పరుగెత్తేవారు—బాంబులు మహానగరాల మీదనే వేస్తారన్న తాత్పర్యంకొద్దీ. ఇపుడు రోజులు మారాయి. ఒక సుబ్రహ్మణ్యేశ్వరావుగా రన్నట్లు బాంబుల బాబుల్లాంటి హైడ్రోజన్ బాంబుల రోజులుఇవి. అవిపడితే వాటికి పల్లె, పట్నం అని పక్షపాతం ఉండదు. పడ్డచోటుకు చాలా దూరందాకా అణుధూళి రాలుతుందని అది చాలా ప్రమాదమనీ కూడా తెలుసు. అటువంటపుడు కూడా పల్లెలకుపోతే మంచిదనుకోడం పొరబాటనీ, నిజానికి పట్నాలలో ఉంటేనే ప్రమాదం తక్కువఅనీ—ఈ సమస్యగురించి ఆలోచిస్తున్న అమెరికన్ ప్రజలకు శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

కారణం: పట్నంలో ఇరుకైనఇళ్లు, దట్టమైనజనాభా, మిల్లులు, ఫాక్టరీలు వగైరాలవల్ల వేడిగాలి ఎక్కువ పారుగూరు నుండి చల్లటిగాలి ప్రాణాలుతీసే అణుధూళిని తీసుకొచ్చినపుడు ఈ వేడిగాలి పైకితేలి, దానికి అడ్డుపడుతుందనీ, ఆధూళి అలాగే పోతుందనీ, పోయిపోయి ప్రశాంతంగా, విశాలంగా, చల్లగాఉన్న పల్లెల మీదనే వాలుతుందనీ తేలింది...

## అణుశక్తి జ్యోతిషం

మీరు సర్కారు ఉద్యోగంలో ఉంటే, 55వ ఏడు పూర్తికాగానే రిటైరై పింఛను పుచ్చుగోవచ్చు. కాని బహుశా మీఅబ్బాయి ఆ ఘట్టానికి వచ్చేసరికి సర్కారు ఇంకో పదేళ్ళు పనిచెయ్యమని అడుగుతారు అని శాస్త్రజ్ఞుల అనుమానం.

కారణం: రేడియో ఐసోటోప్స్ సహాయంతో 25 ఏళ్ళ కుర్రవాణ్ణి పరీక్షించి అతని ముసలితనంలో గుండెజబ్బులాటి వేవైనా వచ్చిపడే ప్రమాదం ఉందేమో ఇపుడే కనుక్కోవచ్చునని పరిశోధనల ఫలితాలు చెబుతున్నాయి. ఈవిధంగా, వయసు మళ్ళేనాటికి మనిషిని కుంగదీసే జబ్బేమీ రాదని తేలితే, దాన్నిబట్టి ఆ మనిషి 60 ఏళ్ళు నిండేదాకానో, 65 వరకూనో, లేదా 48 తోటేనో రిటైరు కావాలని నిర్ణయించేందుకు వీలుంటుంది అందరూ 55వ ఏట విధిగా పింఛను పుచ్చుగోవాలన్న నియమం పోవచ్చు. అప్పుడు మీరు మీ పిల్లడినని బళ్ళో వేస్తే వయస్సు ఓ రెండేళ్లు తక్కువ చేస చెప్పనవసరం ఉండదు.

ఇవన్నీ ఎలాఉన్నా, ముమ్ముందు రాగల జబ్బులు ఈ అణుజ్యోతిశాస్త్రంవల్ల తెలిస్తే ముందుగానే 'శాంతి' చేయించుకు జాగ్రత్త పడవచ్చు.

* * *

రోజూ పంటచేలకి వెళ్ళి కాసేపు వయొలిన్ వాయించివస్తే, మొక్కలు ఏపుగా పెరుగుతాయి. పంటలు సమృద్ధిగా పండుతాయి అన్నారు. ప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసుడు చౌడయ్య గారుఅమధ్య.

ఓంకార జనితమైన ఈ జగతిలో నాద ప్రభావానికి ప్రచలితం కానిదేది లేదన్న వాదానికి దశగోం శాస్త్రజ్ఞుల బలంకూడా చేకూరుతోంది. చికాకులతో మనసు బాధగా ఉన్నపుడు మధురమైన గానంవింటే ప్రాణం హాయినపడుతున్నపుడు శారీరకమైన రుగ్మతలు కూడా ఎందుకు సర్దుకోవు? ఈ విషయమై పరిశోధనలుజరుగుతున్నాయి ★

# వికసించని కుసుమాలు

పెద్దకొడుకు సుందరం మద్రాసునుంచి యింటికి రాగానే మురహరిరావుగారి యింట్లో చిన్నసైజు హడావిడి ప్రారంభమయింది. ఏదో ప్రయివేటు కంపెనీలో గుమాస్తాగిరి చేస్తూ వుండటంచేత సుందరం ఆరునెలల కొకసారికూడ తెనాలికి రావటం అరుదు. ఇంతంత చార్జీలుపోసి గుమాస్తాలకు యింతదూరం రావటం మాటలా? ఈసారి ఎట్లాగో పదిహేనురోజులు సెలవు సంపాదించాడు. తెనాలిలో తలిదండ్రులను తమ్ముడిని, విజయవాడలో యిద్దరు చెల్లెళ్ళను చూద్దామని భార్య, యిద్దరు పిల్లలతో వచ్చేశాడు.

శారద కొడుకుదగ్గరకు వచ్చి "సుందరం! కాకరకాయలూ, సొరకాయా తెమ్మని చెప్పాను నాన్నగారితో. నీకు యిష్టమే కదూ? లేకపోతే మదరాసు పోగానే రుచులు మారినాయా?" అన్నది.

"అదేమిటే అమ్మా. ఎవరో పరాయి వాడితో మాటాడినట్టు మాటాడుతావ్? నా సంగతి నీకు తెలీదూ? అయినా నాకోసరం ప్రత్యేకంగా తెప్పించటం ఎందుకమ్మా?" అన్నాడు సుందరం.

శారద కొద్దిగా నవ్వి వెళ్ళిపోయింది.

ఉదయం పదింటికి సుందరం "ఏరా ఒకసారి స్టేషన్‌దాకా వెళదాం వస్తావా? ఒక స్నేహితుడిని చూడాలి" అన్నాడు సీతాపతితో.

సీతాపతి హైస్కూలులో యింగ్లీషు, లెక్కలు టీచరు. "అతడు ఒక్క పదినిమిషాలు ఆగు అన్నయ్యా. ప్రయివేటు పిల్లలు వస్తారు. ఈ పూటకు యింటికి వెళ్ళమని చెబుతాను. తరువాత యిద్దరం వెడదాం" అన్నాడు.

సుందరం ఆశ్చర్యంతో "యిప్పటిదాకా చెబుతూనే వున్నావుకదురా? యింకా వున్నారా?" అన్నాడు.

సీతాపతి నవ్వుతూ, "పొద్దున థర్డ్‌ఫారం వాళ్ళు, పదింటికి ఫోర్తుఫారం వాళ్ళు, సాయంత్రం ఫిఫ్త్‌ఫారంవాళ్ళు వస్తారన్నయ్యా. స్కూలు వున్న రోజుల్లో ఫోర్తుఫారం పిల్లలుకూడ సాయంత్రమే వస్తారు" అన్నాడు.

"ఇన్నిసార్లు ఎందుకు? అందరికీ ఒక్కసారే చెప్పరాదూ?"

"అందరికీ కలిపి చెబితే వీళ్ళకి చదువు వంటపట్టి చావదన్నయ్యా."

పదిగంటలకు యిద్దరు స్టేషనుకు బయలుదేరారు. దారిలో సుందరం "సరే. మరి నీ కథలు ఏవీ పత్రికల్లో రావటం లేదేంరా?" అని అడిగాడు.

సీతాపతి యిదివరకు మంచి కథలు రాసేవాడు. కొన్ని నవలలు రాశాడు. ఒకసారి నవలల పోటీలో మొదటి బహుమతి వచ్చింది. తెనాలిలో కథకుడుగా అతడికి మంచిపేరు వున్నది.

"ఇప్పుడు కథలు రాసే తీరిక ఏది అన్నయ్యా?" అన్నాడు.

"ఏం?"

## వేమూరి సుబ్రహ్మణ్యం

"ఈ ట్యూషన్‌లు, యీ స్కూలు పనితోనే రోజల్లా గడుస్తోంది. ఇదివరకు సంగతి వేరు. అప్పుడు ఏదో చదువుకోవటం తప్ప యింకే వ్యాపకం లేదు. కనుక కథలు రాయటానికి తీరికవుండేది" అన్నాడు. సీతాపతి నీరసంగా నవ్వుతూ. ఆ నవ్వులో బాధ దాక్కుని వున్నట్టుగా అనిపించింది సుందరానికి.

"అందుకని కథలురాయటం మానేశావా? లలితకళలు సామాన్యంగా ఎంత ప్రయత్నించినా అందరికీ పట్టుబడవు. మరి నువ్వు..."

"నిజమే అన్నయ్యా ఏంచేయను? ఈ ట్యూషన్లవల్ల బోలెడు డబ్బువస్తుంది. వదులుకోమంటావా? మన సంసారం సంగతి తెలుసుకదూ? రాత్రి పదింటిదాకా యీ ట్యూషన్లతోనే గడుస్తుంది. ఇక అప్పుడు రాయటానికి కూర్చుంటే నిద్రముంచుకు రావటమో లేకపోతే మరునాటికి యింట్లో బియ్యం పట్టుకురావటానికి డబ్బు ఎట్లాగా అనే ఆలోచనలతో బుర్ర పాడవుతుంది. ఇంకేంచేయను? అప్పటికీ ఎట్లాగో యీ మధ్య నాలుగయిదు కథలు రాసిపంపితే పదిహేను రోజుల్లో తిరిగి వచ్చినయ్" అన్నాడు సీతాపతి బాధగా.

తమ్ముడి చెప్పినమాటలు సత్యమని ఆ రాత్రి సుందరం తెలుసుకొన్నాడు. తిరిగి వచ్చిన కథలను చదవమని సీతాపతి రెండు కథలు సుందరానికిచ్చాడు. అవి చదువుతుంటే సుందరంమనస్సు చివుక్కుమన్నది. తమ్ముడిలో కథలురాసే నైపుణ్యం యింతగా నశించిందనుకోలేదు. కథకుడుగా పేరు తెచ్చుకొన్న ఆ సీతాపతి తమ్ముడిలో చచ్చిపోయాడని సుందరం ఎంతగానో బాధపడ్డాడు. ఏం లాభం? పరిస్థితులలాంటివి. పొద్దున లేవగానే సమస్యలు దయ్యాల్లాగా ఎదురౌతూ, ఆ దయ్యాలను పారదోలటం ఎట్లాగా అని బుర్ర పాడుచేసుకొనేవాడికి యిక కథలురాసే తీరిక ఎక్కడిది? పక్కగదిలోంచి సీతాపతి

## వికసించని కుసుమాలు

గొంతు పెద్దగా వినపడుతోంది, "నాయక్ కాలువ ముఖ్యం. ఆ పేరాగుర్తు పెట్టండి..." సీతాపతి ఫోర్తు ఫారం విద్యార్థులకు ప్రయివేటు చెబుతున్నాడు. సుందరం ఏదో పుస్తకం తీశాడు చదువుదామని, చదువు సాగలేదు...సీతాపతి చెప్పింది నిజమే... తండ్రి పెద్దవాడయ్యాడు. ఇంటి వ్యవహారాలు సీతాపతే చూసుకోవాలి. డబ్బు వదులుకోవటం అసంభవం కనుక యీ ట్యూషన్లు చెప్పితీరాలి! కథలు రాయటానికి టైములేదు. హే భగవాన్! కథలురాసే ఆ నైపుణ్యం నా వాడికి ఎందుకు ప్రసాదించావ్? ఏ లక్షాధికారి కొడుక్కో, ఏ బాదరబందిలేని వాడికో కలిగించివుంటే వాడయినా గొప్పవాడయ్యేవాడేమో! అనుకొన్నాడు మనస్సులో. చివరికి తమ్ముడితో "ఇక కథలు అచ్చిరాని పత్రికలకుపంపకోయ్. పొరపాటున అచ్చవుతే యిదివరకున్న పేరు కాస్తా పోతుంది" అని చెబుదామని కూడా నిశ్చయించుకొన్నాడు.

* * *

సుందరం చెల్లెళ్ళు యిద్దరూ సుగుణ, సుశీల విజయవాడలోనే వుంటున్నారు. చెల్లెళ్ళను చూడాలని సుందరం విజయవాడ బయలుదేరాడు. వెళ్లేముందు సీతాపతితో "ఏరా నీకథలులాగానే సుశీ ఫిడేలు, సుగుణ సంగీతానికి కాలదోషం పట్టిందా? ఈ మధ్య ఏమయినా రేడియో ప్రోగ్రాములు యిస్తున్నారా?" అని అడిగాడు.

"ఏమో అన్నయ్యా! నేను యీ మధ్య బెజవాడ వెళ్ళలేదు. కాకపోతే యీ మధ్య వాళ్ళు రేడియో ప్రోగ్రాములు యిచ్చినట్లు లేదు" అన్నాడు సీతాపతి. ఒక క్షణం వూరుకొని మళ్ళీ "అయినా నీ పిచ్చిగాని అన్నయ్యా! సంసారాల్లో యిరుక్కొన్న తరువాత యీ ఫిడేలు వాయించుకోవటం, సంగీతం పాడుకోవటం కుదురుతుందా?... అదీకాక, నీకు తెలుసుగా సుగుణ వుద్యోగం కూడ చేస్తోంది" అన్నాడు.

రైల్లో కూర్చుంటే సుందరానికి తమ్ముడి మాటలే గుర్తుకొస్తున్నాయ్. ఏమో! తమ్ముడు చెప్పినట్లు చెల్లెళ్ళుకూడ తమకు అబ్బిన కళలవైపు కన్నెత్తి అయినా యిప్పుడు చూడటంలేదేమో?...ఒకప్పుడు సుందరం తన తమ్ముడిని, చెల్లెళ్ళను చూసుకొని ఎంతో గర్వపడేవాడు. మరీ పోయినసంవత్సరానికి ముందుసంవత్సరంలో తన యింటికి కలిగిన ప్రతిభ యిప్పటికీ తన కళ్ళకు కట్టినట్టుగావుంది. ఆయేడు సీతాపతికి నవలాపోటీలో మొదటి బహుమతి వచ్చింది. ఆయేడే వరుసగా అయిదుసార్లు సుగుణకు, సుశీలకు రేడియోలో పాడేందుకు అవకాశం కలిగింది. తమ కుటుంబాన్ని ఎంత మంది మెచ్చుకొన్నారో! తెలిసినవారెంత

రిలో తనుకు ఎంత గొప్పపేరు వచ్చింది. ఇప్పటికీ తలుచుకొంటుంటే వళ్ళు ఝల్లుమంటుంది... అసలు సుశీల పెళ్ళి ఎట్లా అయింది? తన బాబాయి కూతురు పెళ్ళిలో సుశీల పాడిన సంగీతం విన్న తరువాతేగా శంకరం ఆమెనే చేసుకొంటానని పట్టుబట్టింది? లేకపోతే దమ్మిడీ కట్నం లేకుండా సుశీల పెళ్ళి అయివుండేదా?

సుందరం రైలుదిగి గవర్నరుపేటలో వున్న సుగుణ యింటికెళ్ళాడు. సుగుణ భర్త రాజారావు సిమెంటు కంపెనీలో వుద్యోగం. సుగుణ పెద్దన్నయ్యను చూడగానే ఎంతో సంతోషంతో "రా అన్నయ్యా! ఎప్పుడొచ్చావ్?" అంటూ ఆహ్వానించింది.

"నేను తెనాలివచ్చి నాలుగురోజులయిందే. విన్నా, సుశీలను చూసిపోదామని వచ్చాను. సుశీల ఎట్లావుంది?" అన్నాడు సుందరం.

"ఖులాసాగానే వుందన్నయ్యా. నేను వాళ్ళింటికి వెళ్లి పది పదిహేను రోజులయింది."

"అదేమిటే, ఒకేవూళ్లోవుంటూ రోజూ చూచుకోకపోతేపోనీ, రెండురోజులకొకసారయినా ఒకళ్లనొకళ్లు పలుకరించుకోరూ?" అన్నాడు సుందరం ఆశ్చర్యంతో.

"తీరికెక్కడిదన్నయ్యా. ఇదిగో యీ ఆఫీసు పనితో పొద్దున తొమ్మిదింటి నుంచి సాయంత్రం ఆరింటిదాకా సరిపోతుంది. ఆదివారం విడదామంటే ఏమిటో బద్ధకంగా వుంటుంది" అన్నది సుగుణ. సుగుణ పెళ్లయిననాటికి ఫోర్తుఫారం చదువుతోంది. కాపరాని కెళ్లినతరువాత రాజారావు పట్టుబట్టి మెట్రిక్ చదివించాడు. మెట్రిక్ ప్యాసయిన తరువాత సంసారంలోని ఆర్థికపరిస్థితుల దృష్ట్యా వుద్యోగంలో తానే ప్రవేశించింది. రాజారావు తండ్రి అకస్మాత్తుగా చనిపోవటంతో తల్లిని, చదువుతున్న తమ్ముడిని, చెల్లెలును తానే పోషించవలసి వచ్చింది. ఇంత సంసారానికి రాజారావు జీతం సరిపోయేది కాదు. అందుచేత సుగుణ వుద్యోగంలో చేరటం రాజారావుకు ఏమీ అభ్యంతరం కాలేదు. పైగా సుగుణజీతం కలవటంవల్ల యిప్పుడు సంసారం కొద్దిగా సుఖంగా నేవుంది.

రాత్రి ఎనిమిదయింది. అందరిభోజనాలయినయ్. సుందరం, రాజారావు, రాజారావు తమ్ముడు ముందుగదిలో కూర్చున్నారు. రాజారావు "అది కాదోయ్ బావా. ఆ మదరాసు వదలి యిటువేపు రాకూడదూ? మనవాళ్ళలో వుండొచ్చుగా" అన్నాడు సుందరంతో.

"అదే నేను ప్రయత్నిస్తున్నాను. విజయవాడలో ఒక బ్రాంచి పెడతారుట. అయినా

# ★ వికసించని కుసుమాలు ★

ఒక సంగతి చెబుతానువిను. ఇక్కడికన్నా అక్కడే వున్నదాంట్లో సుఖంగా గడప వచ్చు తెలుసా? పరాయిదేశమనే గాని మదరాసులో జీవితం సుఖంగా వుంటుంది."

రాజారావు ఏమీ మాట్లాడలేదు. రెండు నిమిషాల తరువాత సుందరం "అమ్మాయ్, సుగుణా" అని కేకేశాడు.

"ఏమి టన్నయ్యా" అంటూ సుగుణ వచ్చింది.

"నీ ఫిడేలువాయిద్యం విని చాలా రోజులయిందే. ఒక్కసారి వాయించు. వింటాను."

"ఇప్పుడు యింకా వాయిద్యాలు, సంగీతాలు ఏమిటిలే అన్నయ్యా."

సుందరం నవ్వుతూ "ఏమయ్యా బావా! ఫిడేలు వాయించరాదని ఆర్డరు వేశావా ఏం?" అన్నాడు.

"ఛా! అదేమిటి అన్నయ్యా! ఆయనెందుకంటావ్? ఏమిటో నాకే వాయించాలనిపించటంలేదు," అన్నది సుగుణ.

"పరవాలేదు లేవే. కాసేపు తెచ్చి వాయించు. మీ అన్నయ్యా నీ సంగీతం వినాలని ఎంత కుతూహల పడుతున్నాడో" అన్నాడు రాజారావు.

"వంటింట్లో కొత్త పనివుంది. చేసివచ్చి వాయిస్తాను" అంటూ సుగుణ లోపలికెళ్ళింది.

అరగంట తరువాత సుందరం చెల్లెలి వీణా వాయిద్యం విన్నాడు. తెల్లబోయ్యాడు! వాయిస్తున్నది సుగుణేనా అనిపించింది. ఎవరో దేవత చెల్లెలులోగల ప్రతిభనుచూసి ఓర్వలేక శాపంపెట్టిందేమో. అందువల్ల సుగుణలో ఆ సంగీతంలో ప్రతిభ యీ రకంగా నాశన మయిందేమోనని భావించాడు.

మరునాటి ప్రొద్దున సుగుణను అడిగాడు. "అదేమిటే? సంగీతం అట్లా పాడయి పోయిందేమిటి?"

సుగుణ నీరసంగా నవ్వింది. "ఇంకేం సంగీతం అన్నయ్యా? అసలు ఎప్పుడేనా ప్రాక్టీసు చేసుకోవటానికి తీరికేదీ? పగలంతా ఆఫీసుపని. ఇక సాయంత్రంపూట బద్ధకంగా వుంటుంది. రాత్రిపూట ఎప్పుడయినా కాసేపు వాయించుకొందామంటే, మరిది, ఆడబిడ్డ చదువుకొంటుంటారు. అందుకని వీలుపడదు. ఏమిటోలే అన్నయ్యా. కొందరికి కొన్ని కొన్ని అదృష్టాలు పట్టవు. జీవితమే అంత" అంటూ అక్కడినుంచి వెళ్లిపోయింది.

సుందరం చటుక్కున "సుగుణా" అని పిలిచాడు.

సుగుణ వెనక్కి వచ్చింది. "ఏమిటన్నయ్యా" అంటూ.

"నాకు ఒక సందేహం వచ్చింది. సుశీల సంగతికూడ యింతేనా? లేకపోతే అది ఏమయినా ప్రాక్టీసు చేసుకొంటోందా? లేకపోతే నీలాగే సంగీతం మూలపడేసిందా?"

సుగుణ నీరసంగా నవ్వింది. "దానిసంగతి యింకా అన్యాయం అన్నయ్యా. ఇంటినిండా గంపెడు పిల్లలు. అందరిని యిదే సంబాళించుకోవాలి. అత్తగారు పోవటంవల్ల యింటికి యిదే పెద్దది. దానికి క్షణం తీరికలేదనుకో. ఇంక సంగీతం ఎక్కడ? నీపిచ్చిగాని అన్నయ్యా! ఇదివరకెప్పుడో సంగీతం ప్రాక్టీసు చేశామంటే ఆ సంగతి వేరు. ఇప్పుడు పరిస్థితులు వేరు." అన్నది సుగుణ.

ఆ పొద్దునే సుందరం కృష్ణలంకలో వున్న సుశీల యింటికి వెళ్ళాడు. సుశీల సుందరాన్ని చూడగానే సంతోషించింది. కాని ఎక్కువసేపు మాటాడేందుకు కూడా తీరిక లేదు. ఆమెకంటె చిన్నవాళ్ళు నలుగురు మరదులు, ముగ్గురు మరదళ్ళు వున్నారు. సుందరాన్ని ఒకగదిలో కూర్చోబెట్టి కాఫీ యిచ్చింది. అంతే మళ్ళీరాలేదు. కాని యిక్కడినుంచి సుందరానికి అన్నీ వినబడుతూనేవున్నయ్. "వదినా జడవేయవమ్మా?" అని ఒకరు, "వదినా పరికిణీ ఏదీ" అని యింకొకరు," వదినా చాకలాడు తెచ్చిన యిస్త్రీలాగూ ఏదమ్మా," అంటూ వేరొకరూ యిట్లా అడుగుతుంటే అందరినీ సంబాళించి పంపింది. సుందరానికి పరిస్థితి అర్థమయింది. ఇంత తీరికలేకుండా వున్న సుశీల యింకా సంగీత సాధనచేస్తుందనుకోవటం వట్టి పిచ్చితనం. లాభంలేదు! అంతా అయిపోయింది. తను ఎవరిని చూసి యిన్నాళ్ళు గర్వపడేవాడో వారిలో యిప్పుడు ప్రతిభ యేమీ మిగల్లేదు.

సుందరం మదరాసుతిరిగి వెడుతుంటే అతని మనస్సు ఏమీ బాగాలేదు. "తన తమ్ముడు, చెల్లెళ్ళు యిట్లా అయిపోయ్యారేమిటి? వాళ్ళేం చేస్తారుపాపం!... అయితే లలితకళలు ఒక్క భాగ్యవంతులకే అబ్బవుగదా?...నా పిచ్చిగాని, సమస్యలు లేని వాళ్ళెవరు?...మరి యింకా ప్రపంచంలో యింతమంది సంగీత విద్వాంసులు, సాహితీపరులు వృద్ధిపొందుతూనే వున్నారు కదా? వాళ్ళంతా భాగ్యవంతులా? వారికిసమస్యలు బాధ్యతలూ లేవా?...' ఏటు నిశ్చయించుకోలేక పోయినాడు. ఆఖరికి "ఎవరి అదృష్టానికి ఎవరు కర్తలు" అనుకొన్నాడు మనస్సులో...



# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది






మీ ముఖమును మృదువుగా మరియు
మనోహరముగా ఉంచుకొనుటకు .

## పాండ్స్
### వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణములోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరును అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

> చర్మమును శుభ్రపరచే క్రీమ్   ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

చెస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్ ఏ.లో స్థాపించబడినది)

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గత వారం తరవాయి)

సత్తెమ్మ లోపలికి వచ్చి, యింకా సరిగా పరిచయమైనా కాని ఒక అగంతకుని గొంతు పిసికేస్తున్నారేమో అని భయపడి పిల్లల్ని కేక లేసింది.

ఒక అప్పడం తీసుకొచ్చి "ఇది తింటూ ఉండండి...ఈలోపుగా ఆయన వస్తారు!" నవ్వుతో అందిచ్చింది సత్తెమ్మ.

అవిచిత్ర ఫలహారాన్ని అందుకున్నాడు ఆనందంగా శివరాం!

"అమ్మా! నాకో!" పిల్లలు మారాము చేసి శివరాం అంగకున్న అప్పడాన్ని పట్టుకుని లాగి ముక్కలు చేసేశారు

"ఇదిగో మీ ఒళ్ళు హూనం చేసేస్తాను ఇలా అల్లరిచేస్తే!" పిల్లలను కొట్టబోయినంత పనిచేసి, మడికట్టుకున్న సంగతి జ్ఞప్తికి వచ్చి వెనక్కి తగ్గింది సత్తెమ్మ. పిల్లలంతా భయంతో బయటికి వెళ్ళిపోయారు.

గదిలో గచ్చుమీద కూర్చుంది సత్తెమ్మ తపీగా!...

"ఎప్పుడొచ్చావు బాబూ యీవూరు?"

"ఈ వేళే నండి"

"ఎక్కడుంటున్నావు?"

"హోటల్లో!"

"అరెరె!...మా యింట్లోనే వుండవచ్చు కాని...యిప్పుడు అందరు మా యింట్లోనే వుంటున్నారు...బావగారు...వేలువిడిచిన మేనత్తలు......తమ్ముడు చెల్లెలు.....అత్తమామలు....ఉ....ఆయన లాంటి గుబారామనిషి మరొకడు లేరండి...ఏమిటో ఎవరెవరినో...తీసుకువస్తారు....అయితే నువ్వు సుభద్రమ్మగారి అబ్బాయివా...పేరు ఎక్కడో విన్నానుగాని...పరిచయం..." అంటూ నసిగింది సత్తెమ్మ. ఆలోచిస్తూ శివరాం మౌనంగా నవ్వాడు.

"నీకు పెళ్ళి కాలేదన్నావు కదూ....యీ వూళ్లో ఎవరో ఒకర్ని చూసి ముడి పెట్టేస్తాంలే...మా వారిదగ్గరికి లక్షలొంభై మంది వస్తూంటారు, పెళ్ళికొడుకులు కావాలంటూ...అన్నట్టు, మన డాబాకింద వాటాలోనే ఉందోయి ఒక పెళ్ళికూతురు..." పకపక నవ్వింది సత్తెమ్మ.

"పెళ్ళికి తొందరేముంది లెండి!" శివరాం సిగ్గుగా మందస్మితం చేశాడు.

"అదేమిటోయి అలా అంటావు!......నీకు యిరవై మూడో నాల్లో ఉంటాయిగా.. ఇదేసమయం పెళ్ళికి...పెళ్ళికూతుర్ని పిలవ చేమిటి!" కులికింది సత్తెమ్మ.

సత్తెమ్మమాటల ఉత్సాహం చూసి తక్షణం పెళ్ళి చేసేసేలా ఉందని భయపడ్డాడు శివరాం.

నారాయణ వచ్చాడు....సన్నగా...నల్లగా పొట్టిగా...ఒకపంచె, చొక్కా ధరించి...సంచిలో ఒకపెద్ద అనపకాయ పెట్టుకుని, గదిగుమ్మంలో అడుగుపెట్టాడు. భార్య చనువుగా నవ్వుతో మాట్లాడుతున్న శివరాంవైపు ఒక్కసారి తేరి పార చూశాడు.

"ఈ అబ్బాయి మీ సుభద్రమ్మగారి కొడుకుటండీ!" సత్తెమ్మ భర్తరాగానే నుంచుని సగౌరవంగా పరిచయం చేసింది శివరాంను.

"ఏ సుభద్రమ్మగారు?" తీవ్రంగా ఆలోచిస్తూ ఒక్కక్షణం నిస్తబ్ధుడై పోయాడు నారాయణ.

"మా తాతగారు బ్రహ్మయ్యగారు....రాజమండ్రీలో ఉంటున్నాం..." శివరాం మాటలు నమిలాడు—మెల్లిగా.

"ఓహో!...మీ తాతయ్యగారిని, మీ తల్లిగారిని బాగా ఎరుగుదును!..." ఒక్కసారిగా ఉత్సాహంగా, ఆనందంగా నవ్వాడు నారాయణ....

"అయితే ఎప్పుడొచ్చావు.....ఏమిటి సంగతి?...ఏం చేస్తున్నావు?..." గబగబ ప్రశ్నించాడు నారాయణ.

ఇతను పెళ్ళికొడుకండి ... మన డాబా క్రింది బట్టతలాయన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తే చాలా బాగుంటుంది...ఈడుజోడు చక్కగా..."

సత్తెమ్మను భర్త కసిరాడు ఎప్పుడూ పెళ్ళిగొడవలేనా అని.

క్రొత్తవారి పద్ధతులు మన సత్వాలు, పరిస్థితులు పూర్తిగా అర్థంచేసుకోకుండా నారాయణ ఏ సలహాలు యివ్వడు. మనిషి అవసరాల ననుసరించి, వారికి తగినపనిచేసి పెట్టి మంచి చేసుకుని, తర్వాత నొప్పించకుండా వారిదగ్గరనుంచి స్వప్రయోజనాలు సాధించుకోవడంలో నారాయణ నేర్పరి.

భర్త కసరడంతో సత్తెమ్మ బయటికి వెళ్ళిపోయింది.

శివరాం తన పరిస్థితులు వివరించాడు. తక్షణం ఉద్యోగం కావాలన్నాడు. తప్పక తనకు చేతనయినంతవరకు సహాయము చేస్తానన్నాడు నారాయణ. అప్పుడప్పుడు కనిపిస్తూ ఉండమని సలహాయిచ్చాడు,

శివరాం మళ్ళీ కనిపిస్తానంటూ సెలవు తీసుకుని బయటికి నడిచాడు.

"ఈ సాయంత్రం యిక్కడ భోజనం చెయ్యకూడదుటోయి...నీకు మా యింట్లో ఎప్పుడు భోంచేయాలంటే అప్పుడు చేయవచ్చు" నారాయణ లౌక్యం చూపించాడు.

"అబ్బే! యీసారివచ్చి భోంచేస్తా"! అంటూ శివరాం వెళ్ళిపోయాడు.

రైల్వేలో గుమస్తాఉద్యోగం చేసుకుంటూ జాగ్రత్తగా కాపురం నడిపించుకొస్తున్న ఆ బీద బంధువు నారాయణ తన

కేమీ ప్రత్యేక సహాయం ఉద్యోగాన్వేషణ విషయంలో చెయ్యగలడనే నమ్మిక శివరాంకు కలగలేదు. అయినా అతనిమాటల్లో ఈ నగరంలోని పెద్దల నందరినీ ఎరుగుదు నన్నట్లు స్ఫురించడమువల్ల, ఆమాటలు నిజాలో బూటకాలో ఋజువుచేసుకో డానికి చాలా కాలం ముందుఉందని అయినా స్వప్రయత్నం మానకూడదని నిశ్చయించుకున్నాడు శివరాం.

తిన్నగా నడిచాడు రోడ్డుమీద. పనిలే నప్పుడు ఆలోచిస్తూ మౌనంగా షికారు చెయ్యడం చాలా సరదాగా ఉంటుంది. ముస్తాబైన యువకదంపతులు సినిమాకి లాగుంది, హడావిడిగా నడిచిపోతున్నారు. ఉద్యోగమునుంచి విరమించిన ఒక ముసలాయన చేతికర్ర ఊపుకుంటూ మెల్లిగా వీధిలో నడుస్తూ షికారుకు బయలుదేరినట్లున్నాడు. మనోహరు టాకీసువద్ద జనం గుమిగూడి టిక్కెట్లకోసం క్యూలో నుంచుని రభస చేస్తున్నారు. క్రైస్తవులచర్చి, గంట స్తంభంతో గోపురం చేస్తున్న పార్కు, నలువీధుల మొగలో కనిపించాయి. చుట్టుప్రక్కల భవనాలు గంట స్తంభం, హోటళ్ళు విద్యుద్దీపాలతోరణాలు ప్రదర్శిస్తూ రిపబ్లిక్ దినోత్సవం జరుపుతున్నాయి. పార్కు ప్రక్కనే నిలుచుని ఒకడు పిడత కిందిపప్పు, వేరుశెనగకాయలు అమ్ముతున్నాడు. పార్కులో కూర్చున్న జనం రేడియోనుంచి వచ్చే గీతావళి విరామంగా వింటూ ఆనందిస్తున్నారు. తొందరపని ఉన్నట్లు కార్లు అతివేగంగా రోడ్డుమీద నడుస్తున్నాయి. ఇరానీ హోటలు యజమాని మేజాదగ్గర కూర్చుని గబగబ రాలే రూపాయలు పోగు చేసుకుంటున్నాడు. లెక్కలేనంత జనం, అనేకమైన వ్యాపారాలు ఉన్న ఆనగరంలో ఏదో ఉద్యోగం తనలాంటి చదువుకున్న వానికి దొరకక పోదనే ధైర్యం కలిగింది శివరాంకు...వేరుశెనగకాయలు అమ్ముకుంటూ, పాటలు పాడుతూ వీధిలో తిరుగుతే...హోటల్లో సెర్వరుగా పనిచేస్తే...రిక్షా లాగితేనో...తన్నెవరూ ఎరగని యీ నగరంలో ఎటువంటిపని చేసినా ధనసంపాదన సులభమే అనిపించింది శివరాంకు. సంకుచిత మనస్తత్వాలు గల పెద్దలదృష్టిలో యీ పనులు నీచంగా భావింపబడినా, నిజం పరిశీలిస్తే మనుష్యుని వ్యక్తిగతమైన పరపతికి, చేసేవృత్తికి సహస్రవ్యత్యాసం కనిపించింది. ఏ వృత్తిలోనూ నీచత్వం లేదనిపించింది శివరాంకు.

పార్కులోకి అడుగుపెట్టాడు శివరాం. విశాలమైన ఆ పచ్చిక తివాచీలపై ఎంతో మంది జనం చిన్న చిన్న గుంపులుగా చెల్లాచెదురుగా కూర్చున్నారు ఒకవైపు కుర్రాళ్లు క్రికెటు, మరోవైపు ఫుట్ బాల్ ఆడుతున్నారు. ఒక తల్లి తనబిడ్డను తొట్టె కుర్చీలో కూర్చోపెట్టి త్రిప్పుతోంటే తండ్రి పాపకు ఏవో సంజ్ఞలు చేస్తూ ఆనందిస్తున్నాడు. విశాలమైన హృదయం, విస్తృతమైన భావాలు, వ్యక్తికికూడా అవసరమని ఆ పెద్ద మైదానాలు ఉద్బోధిస్తున్నట్లున్నాయి. సంధ్యాగుణరాగం వదజిమ్ముతున్న విశాలగగనం విప్లవభావాలు వెలిగ్రక్కుతోంది. మైదానాలను చుట్టుతున్న రోడ్లపై నేరేడు, రావి, చింత, మొదలైన వృక్షాలు పిల్లగాలిలో ఖులాసాగా ఊగుతున్నాయి. విశాలమై, గంభీరమై, సుందరమై, విప్లవాత్మకమైన ఆ ఆకాశం మైదానంలా ఒక క్రొత్త జీవితాన్ని ఆ నగరంలో సృష్టించుకోవాలనే. నిశ్చయంతో ఉద్రేకపడ్డాడు శివరాం.

మర్నాడు పొద్దున కాఫీ త్రాగి హోటల్లో కూర్చుని స్థానిక వార్తాపత్రిక తిరగవేశాడు శివరాం. "టైపిస్టు కావాలి!" వార్తాపత్రికలో ఒకమూల కనిపించింది. "ముషీరాబాదు ...420 నెంబరు..." సాలోచనగా మూల పడిఉన్న బెడ్డింగువైపు చూశాడు...మరో రెండు పంట్లాములు, చొక్కాలు నలిగి మాసి ఉన్నాయి. హోటల్లో పనిమనిషిని తక్షణం పిల్చి ఒక పావలా చేతులో పెట్టి ఉతికిపెట్టమన్నాడు, ఒక జత దుస్తులు బయటికి తీసి. ఆ గదిలోనే ఇంకా కొందరు నివసిస్తున్నారు. హోటలు యజమానికి నెలవారీ అద్దె యిచ్చుకుంటూ. ఆస్పత్రిలో వరుసగా పేర్చిన రోగుల మంచాల్లా ఆ హోటలు గదిలో కూడ ఇనపమంచాలు పేర్చి ఉన్నాయి. తమిళులు యిద్దరు ఒక మంచం మీద కూర్చుని ఏవో ఆఫీసు విషయాలు తర్కించుకుంటున్నారు. ఒకాయన తెలుగు డిటెక్టివ్ నిశ్శబ్దంగా చలనం లేకుండా అతిశ్రద్ధతో చదువుతున్నాడు పరీక్షకు వెళ్ళే విద్యార్థిలా. మరొకడు స్నానంచేసి తల దువ్వుకుంటూ యితరుల ప్రసక్తి పట్టించుకోకుండా అపస్వరాల కూనిరాగం అందుకున్నాడు. ఇంకొకరు ఆఫీసు కాగితాల ఫైల్సులో ఏదో వ్రాస్తున్నారు కాఫీ ఒక్కొక్క గుక్క మ్రింగుతూ.

శివరాం మనస్సు వార్తాపత్రికలోని యితర వార్తలు పట్టించుకోలేదు. టైపిస్టు ఉద్యోగం...నెల జీతం...క్రొత్త జీవితం... బస్సుల్లో ప్రొద్దున్నే ఉద్యోగులగుంపులతో ప్రయాణాలు...ఆలోచనలు అలల్లా కదిలాయి. ఈ పగటి కలలకు నవ్వుకున్నాడు శివరాం. మళ్ళీ వార్తాపత్రికమీద లగ్నం చేశాడు మనస్సు.

మధ్యాహ్నం భోజనంచేసి, ఉతికించిన బట్టలు ఇస్త్రీ చేయించుకుని ధరించి వార్తాపత్రిక, తన డిగ్రీపత్రం, కొన్ని యోగ్యతా పత్రాలు తీసుకుని స్టేషనులో బస్సు ఎక్కాడు శివరాం. ముషీరాబాదు పోలీసు స్టేషను ఎదురుగా దిగాడు.

420 నెంబరు!...ఇళ్ళవైపు తేరిపార చూస్తూ, జాగ్రత్తగా నెంబర్లు పరిశీలిస్తూ నడవసాగాడు శివరాం. ఇంటి గుమ్మాల్లో నిలుచున్న గృహిణులు దీక్షగా చూస్తున్న శివరాంవైపు వింతగా చూడసాగారు. టైపిస్టు కావాలని వార్త ప్రకటించిన ఇంజనీరింగు కంపెనీ ఎక్కడ అని దారినిపోయే వారిని ప్రశ్నించాడు. కొందరు తెలియదన్నారు. మరికొందరు విననట్లు గబగబ తలవంచుకు వెళ్ళిపోయారు. మరికొందరు ఏదో అర్థమయినట్లు తలఊపి మరొక వీధి చూపించారు. తిరిగి తిరిగి ఏ వీధిలోనూ ఆ నెంబరు గృహం కనిపించక విసుగెత్తి చికాకుగా నడిరోడ్డు ఎదురుగా హోటల్లో చతికిలబడ్డాడు.

హోటలుచాలా అపరిశుభ్రంగా ఉంది. గుమ్మం ప్రక్క అద్దాల బీరువాల్లో బిస్కట్లు, పేస్ట్రీలు, బన్నులు, రొట్టెలు పేర్చి. కూర్చున వీధిలోపోయే జనాన్ని ఆహ్వానిస్తున్నట్లున్నాయి కప్పులు, సాసర్లు ఠంగుఠంగుమని ధ్వనిస్తున్నాయి. సెర్వర్ల ఉర్దూ, తెలుగు కేకలు, మాటలు, చెవులను గజిబిజిచేస్తున్నాయ్. ఈగలు ముసురుతున్న టేబిలుమీద త్రాగివిడిచిన టీ కప్పులు మరకలలో మూగిగామూస్తున్నాయి. చార్ మినార్ సిగరెట్లుత్రాగుతూ నల్లటి మాసిపోయినబట్టలతో, మందంగా పెంచుకున్న నల్లటిగడ్డాలతో, లోతుకుపోయిన కళ్ళతో కూలీలు టీ త్రాగుతూ తమ అర్థనగ్న జీవితాల సమస్యలగూర్చి ఖిన్నులై ఆలోచనల్లో సతమతమౌతున్నారు.

ఒక గ్లాసు మంచినీళ్ళు, ఒకకప్పు కాఫీ త్రాగి లేచాడు శివరాం. హోటలు యజమానిని ఆఖరిసారిగ 420 నెంబరు యిల్లు గురించి ప్రశ్నించాడు. అక్కడి చౌరాస్తాకు ఉత్తరంగా ఒక ఫర్లాంగు నడిచి తూర్పుగా మొదటి వీధిలోకి తిరగమని సలహాయిచ్చాడు హోటలుయజమాని. ఆఖరుసారి ఆశగా ఆత్రుతతో వెయ్యికళ్ళు చేసుకుని ప్రతీగృహాన్ని పరిశీలిస్తూ నడిచాడు శివరాం.

(35-వ పేజీ చూడండి)

# వసంతోదయం

నందివాడ వెంకట్రామయ్య

కోకిల పాటతో కొత్తకోడలు నిద్ర లేచింది. నిద్రలో వాడి, నలిగి, దారానికి పట్టుతప్పిన పూలు జలజలా రాలాయి, మంచం మీదనుండి నడుమెత్తి లేవబోతోంటే. గుడ్డిగా వెలుగుతున్న బుడ్డిదీపపు కాంతిలో నుదుటిమీది చిరుచెమట బిందువులు రేగిన ముంగురుల మధ్యనుండి మెరమెరా మెరుస్తున్నాయి.

పసినిమ్మపండులాంటి ముఖం ఉక్కలో వడుకోబట్టి, గడ్డిలో కావేసిన మామిడి పండల్లే అయింది. కాటుక కళ్ళపైన పచ్చటి రెప్పలు భారంగా వాలిఉన్నాయ్, నిద్ర లేచినా. బరువుగా లేచి ఒళ్ళువిరుచుకుంది. చీమైనా దూరకుండా బిగించిన కిటికీ రెక్కలు తెరిచింది. వెన్నెలవెలుగు తెలతెల్లగా మందమైపోతోంది. నందివర్ధనలు కనులు విప్పిచూస్తున్నాయ్. మంచుపడిన ఆకులు మందంగా గాలికి కదిలీ కదలక కదులుతున్నాయ్.

హాయిగా ఆరుబైట దుప్పటి కప్పుకొని చందమామ వెలుగులో సపోటా చెట్టుక్రింద మంచంవేసుకు పడుకునేది. చెట్టు మీద కోకిల కవ్విస్తూ పాటపాడేది. బస్తీవెళ్ళిన భర్త వసంతరావు, రాత్రికి తిరిగివస్తాడని చూచిచూచి, వెన్నెలలో ఒంటరిగా పడుకోటానికి భయమేసి, తలుపులన్నీ బిడాయించి లోపలే పడుకుంది. తలుపుతట్టే చప్పుడుకై, చెవులు నిక్కపొడుచుకొని వేచివేచి నిద్రపోయింది.

క్రిందకు వంగిపోయిన పొద్దుతిరుగుడు పూవు వికసించబోతోంది. కోయిలగానం యింకా ఆపలేదు. గూట్లో పావురాయిలు అప్పుడే 'ఆవ్ ఆవ్' మంటూ రెక్కలు విప్పిన చప్పుడయింది. తెల్లతెల్లని వెన్నెల నల్లనైపోకముందే. తూర్పుదిక్కు అరుణారుణమయింది. ప్రకృతంతా చంద్రాస్తమయ సూర్యోదయ సంధిలో, ప్రశాంత విశ్రాంతమై తపోనిష్ఠలోవున్న కైలాసవాసునివలె ఉన్నది. పక్షుల కిలకిలలు, కాకుల గావుకేకలు ఆ విశ్రాంతిని విఘ్నం చేయలేకపోతున్నాయ్.

ఇంతలో క్రావువేసిన 'అంబా' అన్న కేకవిని దొడ్లో కట్టివేసిన లేగదూడ 'ఉహాఁయ్-ఉహాఁయ్' అంటూ అల్లరి చేస్తోంది. అత్తగారు తాడు విప్పిందల్లేవుంది. ఆవుదూడ దౌడుతీసింది తల్లి దగ్గరకు. క్రితంరోజు అత్తగారితో, ఆవుపాలు తను తీస్తానని అడిగింది. అత్తగారు వాకిలిదొడ్డు ఊడ్చటంపని కోడలికిచ్చి, ఆవును పిడకటం తను అట్టిపెట్టుకొంది. సరే! కోడలి సరదా చూచి డిపార్టుమెంటు మార్పుకు సెందుకు సిద్ధపడి 'అలాగే' అంది.

ఆవుదూడకంటే చలాకీగా పరుగెత్తింది కొత్తకోడలు, అత్తగారు పాలు తీయటం ఎక్కడ మొదలుపెట్టి పోతుందో అని. అప్పుడే అవు చేపింది. తోడుమూలు చెంబు క్రిందపెట్టి, దూడను లాగి అవతలికట్టు కొయ్యకు కట్టివేస్తోంది అత్తగారు. కోడలు యిదే సమయం అని తోడుమూలు చెంబు చేత్తో పుచ్చుకొని పొదుగు దగ్గర కూర్చుని పాలుపిండటం మొదలుపెట్టింది. అత్తగారు వెను దిరిగి, జరిగిన పరిస్థితిని చూచి, చీపురు పుచ్చుకొని వాకిలి చిమ్మటం మొదలుపెట్టింది.

పితికేది కొత్తవాళ్ళయినా, గంగిగోవు కదలకుండా పాలుయిస్తోంది. అత్తగారు పాలుపితుకుతోంటే, పాలధారల సవ్వడి తాళరాగాది ధ్వనులతో మిళితమై, నృత్యగీతం పాడుతున్నట్లు ప్రతితెల్లవారుజామూ, 'ఝుయ్యిఝుయ్యి'మని ప్రతిధ్వనించేది. ధార సంపు లేకుండా పిణ తీగలాగా వచ్చేది.

కానీ, యీనాడు పాలధార ఒకొక్కటే చెంబు మీద పడి చిందిపోతోంది. అత్తగారికి మల్లే, మడమలెత్తి గొంతుక కూర్చుని, తప్పాలను మోకాళ్ళతో పట్టి, తలను ఆవుకు పొటిపెట్టి రెండు చేతుల్లో తీద్దామని కూర్చోబోయి తూలింది. గబాలున వరిగిపడే చెంబును పట్టుకుంది. అప్పటికే ఆలస్యమైంది. తప్పాలా మూడు పాళ్ళకే నిండింది. ఆవు దూడ ఓపిక పట్టలేకపోయింది లేగదూడైనప్పటికీ, తన లేబాయపు ఉత్సాహాన్ని బలంగామార్చి, తాడు తెంపుకొచ్చేందుకు మోటుపట్లు పడుతోంది. గుటువు తెలుసుకొని మెడ్రతాడు నుండి తలను జార్చుకొని దబాలున వచ్చింది. కొత్తకోడలు సిగ్గులేక, తీసిన పాలు చాలను కొని లేచింది. వెళ్ళి చెంబును అత్తగారు చూస్తే చిన్నతనంగా వుంటుందని, ఆవిడగారు వచ్చేలోపలే, కుచ్చిళ్ళు పైకిదోపి కుండ కడిగి, దాలిలోవేసి పాలు పెట్టింది.

అత్తగారు కళ్ళాపుచల్లి వచ్చి, చూచి 'అప్పుడే పాలుకూడా పెట్టావుటే! ఇంకా యేం: పరవాలా! అఁ వాడు వస్తాడు తెల్లవారుజాము బండికి – వచ్చేటప్పటికి కాఫీ కాచుకో–రాత్రి ఎందుకని రాలేదో ఏమిటో? బహుశా బండి తప్పిపోయి వుంటుంది. భోజనమది ఎక్కడ చేశాడో ఏమిటో – ఈ బండికి వస్తాడు' అనుకుంటూ వెళ్ళిపోయింది.

కొత్తకోడలు "అవును ఎక్కడ పడుకున్నారో ఏమిటో!" అనుకొని కాఫీకి నీళ్ళుపెట్టింది.

అత్తగారి దగ్గరకు వెళ్ళి "రాత్రి ఎక్కడ భోంచేసి వుంటారు?" అని అడిగింది.

'అఁ ఏహోటల్లోనో భోంచేస్తాడు' అంది.

'అయితే పడుకోవటం...?' అసలు తీర్చుకోవలసిన సందేహానికి ప్రశ్న వేసింది.

'ఆ హోటల్లోనే మంచం తీసుకు పడుకుంటాడు.'



అప్పటికి మంచు విప్పారింది, అరుణ కాంతులమధ్య తెల్లటి కాంతి చొచ్చుకొని వస్తోంది. పక్షులు గూళ్ళు విడచి ఆహారాన్వేషణకు బయలుదేరి పోతున్నాయ్. గొంగళి కప్పుకొని, గొర్రెల కాపరి మందను తోలుకు వెడుతున్నాడు. ఊరు మధ్యనుండి కూరో 'తోటకూరా' అంటూ కోడికూత లాగా వినవచ్చింది.

చీకటి చాటున నీళ్ళు తెచ్చుకొనేపడుచు పిల్లలు తెల్లవారిపోతోందని, త్వరగా బిందెలను చంకన పెట్టుకొని, అందెల చప్పుళ్ళతో చెరువుకు వెడుతున్నారు పాలేరు బుడ్డాడు వళ్ళు విరుచుకుంటూవచ్చి సావిడి బాగు చేయటం మొదలు పెట్టాడు. కొత్తకోడలు అజమాయిషీగా సావిడి దగ్గరకు వెళ్ళింది.

'రాత్రి గొడ్లకు మేత వెయ్యకుండానే వెళ్ళిపోయావేరా–? అయ్యగారు లేరనా?' అంది.

పాలు త్రాగిన ఆవుదూడ, అమితోత్సాహంగా దొడ్డిని విడిచి పరుగులు తీస్తోంది. బుజాలమీద బిందె లెత్తుకొచ్చే ఆ పడుచులను బెదరకొట్టింది. కంగారుగా వేసిన అందెల మ్రోతకు తన మెడ గంటల చిరుధ్వనిని వంత కలిపింది అంగులో ఒకపడుచు ముద్దొచ్చే

ఆ దృశ్యాన్ని చూస్తున్న కొత్తకోడలు మనసు ఉప్పొంగి, పూలుకోసి లేగదూడ మెళ్ళో దండ కడదామని, దబదబా పూల చెట్టువద్దకు వెళ్ళింది.

తన ఆనందాన్ని తెలియజెప్పటానికి చెంత భర్త లేడు. ఈ ఒక్క రాత్రికే భర్త సందర్శనం లభించి యుగయుగాలైనట్లు బాధపడింది తన విరహాన్ని, ఆ వసంతోదయాన వలపు తలపులతో వళ్ళు మారుస్తోంది. ఆ తలపుల మధ్య, పువ్వులుకూర్చి చక్కటి మాల కట్టింది. వసంతరావు లేని వసంతోదయం కొరతగా తోచింది. మాల మెళ్ళో వేద్దామని ఆవుదూడకోసం వెళ్ళింది. అది ప్రొద్దు తిరుగుడు పూవు మీదపడిన ప్రసన్న కిరణాలను పరిశీలిస్తున్నట్లు నుంచుంది కొత్త కోడలు చెంతకు వెళ్ళే సరికి, చెలగాటగా పరుగెత్తింది. పట్టుకోవాలని వెంటపడింది కొత్త కోడలు.

అత్తగారు, దొడ్డినపడి కొత్త కోడలు వేస్తున్న చిందులూ, కోడెదూడ చిందులూ విడ్డూరంగా చూస్తోంది. చేతికి చిక్కీ చిక్క నట్టువచ్చి, తప్పించుకు పారిపోతున్న కోడెదూడను వసంతరావువచ్చి పట్టుకున్నాడు. కొత్తకోడలు పరుగు దూడదగ్గర ఆగింది.

'ఏమిటీచిందు' లన్నాడు వసంతరావు.

అని చూపులతో నే సమాధానమిచ్చి దూడకు వేద్దామనుకున్న దండ వసంతరావు మెళ్ళో

### అతని గొడవ

అద్దెకిచ్చిన పెద్దబంగళా పై అంతస్తులో ఉంటున్న ఇంటి యజమాని దగ్గరకు అర్ధరాత్రి అద్దెకుంటున్న ఒకాయన వచ్చి సూటిగా యిలా ప్రశ్నించాడు.

'ఏమండీ. అర్ధరాత్రి అపరాత్రి భర్తతో కయ్యాలాడే గయ్యాళి ఇరుగు పొరుగువాళ్లకు నిద్రాభంగం కలిగిస్తోంటే మీరు కల్పించుకోరేం?'

యజమాని: మీరా ప్రక్క పొరుగున వుంటున్నారా?

"కాదు-నేనామె భర్తనే" అని ఆయన తటాలున సమాధానం యిచ్చాడు.

# కళింగరావు కల్యాణం

కళింగరావు అంత పొడుగు కావటం అతని తప్పంటే న్యాయం కాదు. అది అతని తప్పే అయితే ఈ సువిశాల ప్రపంచంలో ఎంతోమంది ఆ తప్పు చేసినవారు వున్నారు. అది పాపమనండి, పుణ్యమనండి, అతను పొడుగైనవాడు.

"అతనా! చాలా పొడుగైనవాడు సుమీ" అంటూ గుర్తుపడతారు జనం. బారుగా, ఆకాశాన్ని తలతో ఢీకొడుతూన్నట్టుగా, పెద్ద గాలిగోపురంలా, 'గాలి'లా, ఎత్తైన తాటిచెట్టులా, యింకా ఎన్నో విధాలుగా కళింగరావు ప్రపంచానికి పరిచయం అయ్యాడు.

అంత ఎత్తు లేకపోతే, కాస్త న్నా అందంగా వుండేవాడేమో! "నే నవమంటే అయ్యానటర? మీగు రీను..." అంటూ చిరునవ్వు నవ్వితే, అది కడుపుబ్బ నవ్విస్తుంది అతని మిత్ర ప్రపంచాన్ని.

"నేను అంతే ఎత్తుకాదు లేరా. నార్మల్. నిజం మాట్లాడితే మీరంతా పొట్టివాళ్ళోయ్. మరేను." అంటూ కోపం తెచ్చుకున్నట్లు మాట్లాడితే, మాకు కోపం రాదు సరిగదా, ముక్కుమీద వ్రేలు వేసుకొని, 'ప్రపంచం!' అనుకుంటాం.

కళింగరావుతో మాట్లాడుతూంటే నావంటి సగటు పొడుగువాడికి, ఒక చిన్న స్టూలు వేసుకుంటేగాని సరిపోదు. మామూలుగా ఐతే, తలపైకెత్తితే, ఏ కొండ శిఖరాన్నో చూస్తున్నట్లు, విపరీతమైన స్వరూపం పెంచుకొన్న వీర 'హనుమాన్'తో మాట్లాడుతున్నట్లు వుంటుంది. 'కళింగరావు కాలాంతకుడు—' అంటారు అందరు.

పాపం వాడు నిజంగా మంచి స్నేహితుడుగా, బి. ఏ. చదివిన నిరుద్యోగిగా, చక్కని పలచటి 'బాయ్'గా, బుద్ధిమంతుడుగా, —కంటే. "బారుమనిషి"గా ఎంతో ఆకర్షణ ఇచ్చేవాడు, మాకు.

కాని ఇన్నాళ్ళు లేని ఒక చిక్కు టకీమని ప్రత్యక్షమై 'మిస్టర్ కళింగరావు! నేను రెడీ..' అంటూ వచ్చినట్లయింది.

ఇంతకీ వచ్చిన దేమిటంటే, కళకళ లాడే మోముగల— కందుకూరి కళింగరావు— యిరువై ఐదు వసంతాలు పూర్తి చేసుకొన్నాడు. ఇక్కడేవుంది విశేషం. హఠాత్తుగా వాడిని ఒక యింటివాణ్ణి చేయాలని, వాడి తండ్రికి ఆలోచన కలిగింది.

ఒక సుదినాన—సుదినం అంటే నాకు అసలు నమ్మకమే లేదు— కళింగరావు అమాయకంగా అంగలేస్తూ ప్రవేశించాడు మా రూములోకి. వాడి గాబరా చూసేసరికి, అక్కడ వున్న వారందరకు గాబరా వేసింది.

'కాస్త కుర్చీలో కూలి, విశ్రాంతి తీసుకో ముందు...' అన్నాను.

'చంపకురా కుంకా, నీవు మరీ కొంటెగాడివి' అంటూ నిశ్శబ్దంగా నిల్చొని, ఒక నవ్వునవ్వి, తలవూపి 'ఓ మంచి మాట వుందోయ్' అన్నాడు.

వేయికళ్లతో ఎగురుచూసినట్లు 'ఏమిటి తేల్చు తొందరగా' అనేసరికి, "అబ్బాయిలూరా! మీ అందరకు నాగృహమందు యీ సాయంసమయాన, అల్పాహారవిందు; మా ఫాదర్ అధ్యక్షతను; యిదియే నాసందేశం"

## దావర్ల శ్రీరామకృష్ణ

అంటూ ముగించి, మూతి ముడుచుకున్నాడు కళింగరావు.

"థ్యాంక్స్! మిస్టర్ రావు! నీ హృదయం వెన్న వంటిది. నీవు కర్ణుడవు, నీ దానశీలము, ఆహాహా, ఏమి చెప్పను...' అంటూ కొంటె కోణంగి చిట్టిపొట్టి 'కిష్టు' అన్నప్పుడు కళింగరావు ముఖంలో కాంతి దేదీప్యమానమై, తేజోవంతమై, అనంతమై, ప్రకాశించింది..

కాని కారణం ఎవరికీ తెలియ లేదు. కళింగరావు అల్పాహారవిందుకు ఏదో వుంది 'రత్నగిరి రహస్యం'; ఐనా తప్పుతుందా అనుకొని 'ఏంరా, బాయ్! అసలు విషయమేమిటి? యీరోజు ఎవరిముఖం చూశామో గదా!' అని నిలదీసి నిక్కచ్చిగా అడిగేసరికి "ఇప్పుడు చెప్పకూడదోయ్! అంతా ఐదు గంటలకు తయారవండి' అన్నాడు కళింగరావు.

మా అందరకూ అది సమస్య అయింది. విందుకుగల వింత కారణం ఏమిటా అని!

'బహుశః వాడి పుట్టినరోజు ఐవుంటుంది; అందుకే పార్టీ...' అన్నాడు కిష్టు.

'ఏడ్చావులే! ఇంతక్రితం ఏనాడైనా చేశాడేమిటి?' అన్న నా అభిప్రాయం అందరకు నచ్చి దాన్ని కొట్టివేశారు. ఏదేమయినా, ఆ సాయంత్రం ఒక అల్పాహారవిందు ఉచితంగా లభించింది మా కంపెనీకి; పైగా కళింగరావువంటి కరుకులోభి యింట్లో! ఆహో! దివలి.

రెండు స్వీట్లు కారా, డ్రింక్సు మాత్రమే ఐనా అదృష్టం వుండాలి తింటానికి; మాకు నిజంగా ఉత్సాహం కలిగింది కళింగరావు అల్పాహారవిందులో. అంతా అయినాక బాతాకాని, కొడుతూవుంటే కళింగరావు తండ్రి అకస్మాత్తుగా ఒక ప్రకటనచేసి ఆశగా చూశారు "అబ్బాయిలు! మా కళింగరావుకు పెళ్లి చేద్దామని వుంది." అన్నారు ఆయన.

మాకు ఊపిరి ఆడలేదు. నవ్వటానికది సమయం కాదు. విచారించటం యోగ్యం కాదు. ఒకరినొకరు చూసుకొని అందరం ఆయన కళ్ళల్లోకి చూశాము "శుభస్య శీఘ్రం..." అన్నట్లు.

కళింగరావు ఆకాశంలోకి చూసి, అక్కడ నుండి దూరానవున్న గులాబిపొదలోనికి ఆఖరికి మామీదుగా చూసి సంతోషం ప్రకటించాడు.

"ఐతే ఒక యిబ్బందివుంది మనకు. వాడికి

# ★ కళింగరావు కళ్యాణం ★

తగిన వధువును చూడాలి. ఏమంటారు" అన్నారు కళింగరావు తండ్రి.

'మరేను. అది చాలా కష్టం కూడాను...' అన్నాము అందరము అందుకొని ఏక కంఠంతో.

కళింగరావుకు 'కంగ్రాచ్యులేషన్స్' చెప్పి శలవు తీసుకొన్నాము అంతా......

కళింగరావు పెళ్ళిచేసుకొంటే అందరి వలెనే మాకూ యిబ్బంది లేదు. అతని తల్లిదండ్రులకంటే అక్కచెల్లెళ్ళకంటె మేమూ ఎక్కువగానే హర్షిస్తాం. ఎటొచ్చీ ఒక చిక్కువుంది. ఆరడుగులు దాటి ఆకాశాన్ని అంటుతుంటే కళింగరావుకు తగిన అందమైన ధనంతో కలిగిన పెళ్లికూతురు ఎక్కడ దొరుకుతుంది?

అందుచేతనే కళింగరావు తండ్రి పద్మనాభశాస్త్రిగారు చాలా యిబ్బందులకు లోను కావలసి వచ్చింది. చక్కగా, నాజూకుగా, ఆకర్షణీయంగా వున్న పిల్లలు వున్నారంటే వారికి డబ్బుఉండదు. కట్నం ఇవ్వలేరు. అదీగాక కళింగరావు ఎత్తుకు ఎలాగూ జతకుదరదు. కట్నం బాగా, ఎక్కువగా, చెప్పుకో దగినట్లుగా, వినదగినట్లుగా భుజాలు వూపుకోదగినట్లుగా ఇతరుల నోరులు వూరదగినట్లుగా ఇవ్వగలిగితే తప్పకుండా ఆ అమ్మాయి బాగుండదు. చాలా కేసులు యిలా వుండటం, అన్నీ తిరిగిపోవటం జరుగుతోంది.

కళింగరావు కళ్యాణం అనుకొని ఆరు నెలలు అయిపోయింది. మాకు నిరాశ కలుగకపోలేదు; నిరాశతోడు కోపం మరీ ఎక్కువయి కళింగరావంటే 'ఏడ్చాడులే' అనేదాకా వచ్చింది. ఇందులో కళింగరావుది తప్పంటే, అలాఅని ఎవరైనా అంటే వాళ్ళకు పాపం చుట్టుకుంటుంది; వాళ్ళు వరాసరి నరకానికి పోతారు. వాడి తప్పేముంది? వాడు దేన్నయినా కాదన్నాడా? అజాతశత్రుడు; మరి వాడి నాన్న? ఆయనేమన్నా పెళ్లి చేయను అన్నాడా! ఎన్నో తిప్పలు పడ్డాడు. చాలాచోట్ల తిరిగాడు. మగపిల్లవాడు ఒక్కడే ఒక్కడు. ఉన్న ఒక్కడికి మంచి అమ్మాయిని తేవాలని ఆశ! అంతకంటే ఆయన చేసిన తప్పిదం ఏముంది? తిప్పివరిదైనప్పటికి కళింగరావు పెళ్లిమాత్రం ఏరోజా కారోజుకి వెనుకపడుతునే వుంది.

కాని కాలం ఆగదు; అలాగే ప్రవాహం కూడాను. 'కక్కు వచ్చినా, కళ్యాణం వచ్చినా' ఆగదంటారు పెద్దలు. అది నిజమనిపించింది మాకు, ఒకరోజు కళింగరావుకు వచ్చిన సంబంధంమాట విన్నాక. కళింగరావు స్వయంగా చెప్పాడు అన్ని విషయాలు; దూరాభారం కాదు. పది మైళ్ళలో బెజవాడ. కట్నం అడిగటమే తరువాయి వాళ్లు కాదనరుట! బాగా వున్నవాళ్ళు; పెద్ద వ్యాపారస్తులు.

ఆ రోజు పెళ్లిచూపులు.

"బెజవాడ వెళ్లాలి. మీరంతా నా వెంట వుండాలి. అందరూ సుమా! ఎవరూ 'మిస్' కాగూడదు..." అన్నాడు కాబోయే కళ్యాణకుమారుడు కళింగరావు. మాకెవరికీ యిష్టంలేదు. ఎందుకంటే అంతా చిన్నవారం. పెళ్ళికానివారము. పైగా పెళ్ళి కావలసినవారము. అలాంటి సమయాలలో మేం ఒరగబెట్టేది ఏమీలేదు. అది మాకు తెలుసు; ఆహ్వానించినవారికీ తెలియకపోదు. పెళ్ళిచూపులకు వెళ్లవలసింది బాగా తెలిసిన అనుభవజ్ఞులు! వ్యవహారకర్తలు. అయినా తప్పదు. ఎందుకంటే కళింగరావునుగురించి ఈవరకే 'కాలాంతకుడు' అన్నాను; చాలా కరుకైనవాడు. అందరమూ ఆ ప్రకారమే సిద్ధమయ్యాం ఆ రోజే చిన్న టాక్సీలో.

పెళ్ళికూతురు తండ్రి ఎంతో ఆప్యాయత చూపించాడని చెప్పాలి. బ్రహ్మాండమైన బంగళా, విశాలమైన ఆవరణ. ఆయన ఎంత ధనవంతుడో వూహించటం తెలివి తక్కువ పని. కళింగరావు అదృష్టవంతుడై వుంటాడు. ఏ జన్మలోనో ఎంతో కొంత పుణ్యంచేసుకొని వుండాలి. లేకపోతే అసాధారణ ధనవంతుడికి అల్లుడైతే దాన్ని ఏమనాలి? అనుకోకుండా లక్ష్మి వరిస్తుందట.

'గతికితే అతకదు' అనే ఆచారాన్ని ఆయన తీవ్రంగా నిరసించాడు; పాతపద్ధతులు, ఆచారాలు అన్నీ వతిపనికిమాలిన ప్రచారములని—ఆయన అభిప్రాయం! బ్రహ్మాండమైన పార్టీ యిచ్చాడు. పొడలు కొట్టినట్లయింది మాకు. అయినా కళింగరావు అదృష్టవంతుడు; మరి కాకపోతే లెక్క పెట్టటానికి తీరికలేని ధనం కలిగిన, కాపిటలిస్టు మామగారుగా దొరకటం సామాన్యమా!

"చూడండి! నా విషయం చాలా 'ఓపెన్!' ఉన్న నాల్గు రోజులు ఉజ్వలంగా గడపాలని నా ఆశయం. ఒక చేత్తో సంపాదిస్తున్నాను. మరో చేతితో మిగతా పని—అంటే—ఖర్చు—చేసున్నాను. నన్ను గురించి నేను చెప్పటం బావుండదనుకొండి..." అంటూ కళింగరావుకు కాబోయే మామగారు—పాండురంగంగారు తాపీగా సగర్వంగా అన్నారు.

మేము ఉత్సాహంతో, వినయంతో, అంగీకారంతో చూశాము...

పార్టీ అవగానే అసలు విషయాలు చర్చించటం కొరకు, ముఖ్యంగా కాబోయే కళింగరావు అర్ధాంగిని దర్శించి వాడి మరియు మాయొక్క నిర్ణయములు తీసుకొనుటకు—అందరినీ అందమైన 'హాలు' లోనికి తీసుకెళ్ళారు.

"ముందే చెప్పినట్లు నేను డబ్బుకు ఆశపెట్టుపట్టే రకం కాదు! నాకొ, ఒకమ్మాయి ఒకబ్బాయి. ఎటొచ్చి ఏనాటికైనా వారిద్దరకే ముట్టచెప్పుతాను. ఇక మీ అబ్బాయి విషయం—నాకు నచ్చాడు: నచ్చకపోతే అసలు మీకు 'పార్టీ' యిచ్చేవాడినే గాదు. మరి..." ఏదో పూర్తి చెయబోయారు పాండురంగంగారు 'కానీయండి' అన్నట్లు మేమంతా చూశాము. కంగుకూరి కళింగరావుకు ఎంత సంతోషంగా వుందో తెలుసుకోవటం కష్టం! సంతోషాన్ని కొలిచే 'మీటర్లు' కనిపెట్టినా బాగుండేది. వాడి తండ్రిమాట సరేసరి.

"ఇంతకీ అబ్బాయికి కట్నం ఏమన్నా కావాలంటారా! మీయిష్టం! అడిగితే అడగండి నేను ముందె చెప్పినట్లు నా ఆస్తిలో సగం" చిరునవ్వు చిలకరిస్తూ పాండురంగంగారు నిర్లక్ష్యంగా మాట్లాడేరు.

కళింగరావు ఒకసారి 'కాలర్' సరిచేసుకొన్నాడు. పద్మనాభశాస్త్రిగారు పద్మము వంటి ముఖంపెట్టి, డబ్బంటె అసలు తనకు ఆశలేనట్లు చూడండి పాండురంగంగారు! నేను వేరే" చెప్పను! ఎందుకంటే మీరు అన్నివిషయాలు తెలిసినవారు..." అనేశారు.

"అలా అయితే! నాకోరిక చెపుతాను వినండి! ఎప్పటిమాటో యిప్పుడెందుకు! ఇప్పుడు అబ్బాయికి యిరవైవేలు కట్నంగా యిస్తాను, ఇక లాంఛనాలు అన్నీ నాహోదా, సంప్రదాయాలకు తగినట్లుగానే జరుగుతాయి..." అన్న పాండురంగంగారి ప్రకటన అందరనూ నిశ్చేష్టులను చేసింది.

కళింగరావుకు ఏ క్షణాన అయినా గుండె ఆగిపోయే ప్రమాదం వుందని గ్రహించి నేను జేబుదస్తీతో గాలివిసిరాను. పద్మనాభశాస్త్రిగారి రక్షణకు 'కిష్టు'తో కనుసైగ చేశాను. "ఇంకొ నాకు సంతోషకరమైన విషయమేమిటంటే, అబ్బాయికి ఒక లాంబ్రెట్టాకొని యిస్తాను. మా అల్లుడు భూమిమీద

నడవటం నాకు యిష్టంలేదు. ఎటూ చదివిన వాడే కాబట్టి నాఫ్యాక్టరీలోనే 'మేనేజరు'గా వుంచుతాను. ఏమంటారు..." పాండురంగంగారు చెబుతోంది 'కలయో' 'వైష్ణవమాయయో' అన్న భ్రమ, అనుమానం కలిగింది మాకు ఎవరు ఏమంటారు, గాలి పీల్చుకోటం కూడా కష్టంగా వుంటేను.

ఇంతకీ పెళ్లికూతురిని చూసే సమయం సమీపించేటట్లు లేదు. అంతా మాటలతోనే జరుగుతోంది. ఎంతసేపని ఎదురుచూస్తాం. చివరికి 'నోరారా' అడిగేవరకు, అంటే కళింగరావు తండ్రిగారు 'పిల్లని' చూపిస్తే చాలా సంతోషంగా వుంటుందని అనేవరకు చూశాం.

"ఆ! అలాగే పిల్లని రప్పిస్తాను కాని ఓ చిన్న విషయం, అమ్మాయి కొస్త పొట్టి నావలెనే చామనచాయ, ఐనా – రంగుంటే కొరుక్కు తింటామటండీ!" అన్నారు పాండురంగంగారు.

ఆ విషయం మాకు రుచించలేదు. పిల్ల పొట్టి. మరి కళింగరావు – "కనీవిని" ఎరుగని ఎత్తు. పైగా ఆయన మాటల్లో 'చామనచాయ' అయితే దాదాపు కాకి నలుపు ఐవుంటుంది. అందరకు నిరాశకల్గింది. ఇంతకష్టం, యింతగొప్పతనం అన్నీ వృత్తి కబుర్ల పంచాంగం అయ్యేట్లుంది.

ఐనా ఓపిగ్గా ఆ అమ్మాయిని చూడాలని పించింది. ఎదురుచూసినంతసేపు పట్టలేదు. నామట్టుకు నేను ఆ అమ్మాయిని చూడకుండా కళ్ళకు గంతలు కట్టుకొందామనుకొన్నాను. బావుండదనిపించి—కిటికీలోనుండి దూరానవస్తున్న కాంతను చూశాను. కళింగరావు ముఖంలో నెత్తురుచుక్క లేదు. పద్మనాభశాస్త్రిగారు ఎంతో అసంతృప్తితో వున్నట్లు కనుపించారు.

ఆ అమ్మాయినిగురించి వర్ణించనవసరం లేదు. ఆమెరంగు ఏమిటో నాకే తెలియలేదు. నలుపుకు మించిన నలుపు. ఇక ఎత్తు; కళింగరావులో సగం కంటే తక్కువే. ముఖంలో కళ లేదు సరిగదా, కళ్ళల్లో రెంటికీ చూపు వుందనే నమ్మకం నాకు కలుగలేదు. అలాంటి అమ్మాయిని ఏనాడు చూసివుండలేదనే నమ్మకంకుదిరి అందరం శెలవు తీసుకొన్నాము..."వస్తామండి! తర్వాత కబురు చేస్తామండి..."అని పద్మనాభశాస్త్రిగారు అంటూంటే పాండురంగంగారి ముఖం వివర్ణమయింది.

ఈ సంబంధంకూడా తప్పింది! అయినా ఎవడిస్తాడు వేలకువేలు! ఎవడైనాయిస్తే ఈలాంటి మారని రూపాయలవంటి రంభలను పెట్టుకొన్నవారే సంసిద్ధం. డబ్బే ప్రధానం, పిల్ల ఎలావున్నా పర్వాలేదనే ధీమంతుడు వుంటే వేరెచెప్పనవసరం లేదు.

కళింగరావు కళ్యాణం మళ్ళీ వెనక్కుపోయింది. అది చాలా దురదృష్టమని

# ★ కళింగరావు కళ్యాణం ★

చెప్పాలి. పెళ్ళికాదనే భయం ఏమీలేదు. ఏనాటికైనా కాకమానదు. కానీ కావలసిన గుణాలతో, ఆస్తితో, అందంతో, వజ్రం లాంటి సంబంధం ఒకటీ దొరకటంలేదు. మాకు టీపార్టీ చేసిన ఆరోజు, పెళ్ళిచేయాలనే తలంపువచ్చిన ఆగడియ, అట్టే మంచిది కాకపోవచ్చు; లేకపోతే ఎంతమందికి పెళ్ళిళ్లు కావటంలేదు ఈ భూమిమీద! ఈ కళింగరావుకి ఒక్కడికే రావాలా యీ సమస్య.

కళింగరావుకు, అతనితండ్రికివున్న నిబంధనలలో కాస్తన్నా 'పట్టువిడుపులు'వుంటే యింతరభస జరుగకపోను. 'అవ్వకావాలి, బువ్వకావాలి' అంటే ఎలా! పోనీ మన బంగారం మంచిదాఅంటే అదీలేదు.

కొన్నాళ్ళవరకు ఈ సమస్యను వాయిదా వేసేశాను: మాకే ఇంతకష్టంగావుంటే కళింగరావుకు ఎంతబాధగా వున్నదో మరి.

ఒకరోజు మామూలుగా గదిలో కూర్చుని 'హిందూ' తిరగేస్తున్నాను. కళింగరావుతోపాటు బృందమంతా వుంటునే వుంది నిరుద్యోగులమైన మా అందరకూ ఆశాజనకమయిన ప్రకటనల పేజీ చూసి చదువుతుంటే హఠాత్తుగా 'మాట్రిమోనియల్' కాలమ్ మీదకు కళ్ళువాలాయి. మెరుపు లాగా ఆలోచన తట్టింది. వెంటనే కళింగరావు వైపు చూశాను.

"వరుడు కావలెను. ఇంటర్ ప్యాసై, యింటి పనులు, సంగీతము చక్కగా తెలిసిన బ్రాహ్మణ యువతికి...అమ్మాయి కాస్త పొడగరి కనుక బాగా పొడుగ్గావుంటే వారివద్దనుండిసమాచారము కోరబడుచున్నది! తగిన కట్నం యివ్వబడును..."

ఆ ప్రకటన నాకు నచ్చింది. కళింగరావు నిబంధనలకు సరిపోయిందనే వుద్దేశ్యంతో-సంతోషపడి, పెద్దగా అందరూ వినేట్లు చదివాను......

"ఎందుకైనా మంచిది! ఒక అప్లికేషన్ చేయాలి. ఈ దెబ్బతో కళింగరావుకు కళ్యాణపు గీత కలిసిరావాలి..."అన్నాను. కళింగరావుకు యిష్టంలేదు. అంతా అపహాస్యం పాలు అవుతుందని భయం. కాసేపు నచ్చచెప్పి ఎలా అయితేనేమి, కళింగరావును ఒప్పించాలి! చివరకు వాడి



నాన్నతో కూడా చెప్పి ఆయన్ని సంతృప్తి పరిచాము.........

మా కందరకు గట్టి నమ్మకం కలిగింది. ఈసారి కళింగరావు కళ్యాణం ఖాయం! ఆ సుముహూర్తం,గడియవరిచేరనున్నాయి, ఇక పెళ్ళిఅవదనే ప్రసక్తేలేగు, ఎందుకంటే ఆ ప్రకటన ప్రకారం అన్నీ నచ్చినట్లు స్పష్టం! 'కట్నం' అనే ఆశ వాళ్ళుచూపనే చూపారు. అబ్బాయికి అమ్మాయి, అమ్మాయికి అబ్బాయి-తగిన ఈడు, ఎత్తు, అన్ని క్రమనిష్పత్తిలో వున్నట్లు నమ్మకంకలిగింది.

వెంటనే జవాబు వచ్చింది, వ్రాసిన జాబు చేరినట్లు, చాలా ముదావహమని, వివరాలు చాలా వరకు నచ్చినవనిన్నీ, అయితే కట్నం కనీసం ఎంతవరకు రాబట్టుకోవాలని వుందో తెలియపరిస్తే ఆ తర్వాత యితర విషయములు చర్చించతగునని ఆ ప్రకటనలో వున్న ఆయన వ్రాసేరు. ఈ త్తరం ముగించే ముందు మాత్రం ఆయన చాలా ముఖ్యమైన విషయం వ్రాసేరు. "అమ్మాయి ఈ వరకే ప్రకటించినట్లు కాస్తపొడగరిగనుకతగినఎత్తు గలవారైఅయితేజతబావుంటుంది..."అని...

"అమ్మాయి పొడగరి : తగినవారే అయితే బాగుంటుంది..." అన్న వరకు అందరకు సంతృప్తి నిచ్చింది. కళింగరావు కోసమే ఆ అమ్మాయిని భగవంతుడు సృష్టించి వుంటాడు. లేకపోతే ఎలా జత కుదురుతుంది? అయినా; అనుమానం రాక పోలేదు: 'అమ్మాయి పొడగరి' అని బాగా ఉద్ఘాటించటం చూస్తే ఆమె ఏ సూర్యగోళానో్న తాకే అంత పొడుగువుందో, చివరకు కళింగరావే ఆమెలో సగంవుంటాడుగదా కొంపదీసి, అని.

ఎందుకైనా మంచిదని ఆ ప్రకటన చేసిన పెద్దమనిషికి ఒక లేఖలో అమ్మాయి ఫొటో ఒకటి పంపవలసినదని, ఆమె పొడుగు ఎంత వుందో పరిగ్గా తెలియపరచటం అవసరమనీ, వ్రాశాము.

అనుకున్నంతా, ఐంది. ఎవరు ఎన్ని చేసినా, దేవుడు మేలు చేయకపోతే కలిసిరాదు. కాకపోతే చివరకు ఈ ప్రయత్నం కూడా కలిసిరాకుండా పోవాలా!

అసలు విషయం ఏమిటంటే-'కాస్త పొడగరి' అనబడిన ఆ 'ప్రకటనాసుందరి' కళింగరావుకంటే కనీసం ఒక అంగుళం ఎత్తు. పోస్టులో వచ్చిన ఫొటో చూచేసరికి నాకే భయమేసింది. పోయిన వస్తువులు మంచివిగా, చూసిన 'పిల్లలే' అందముగా వున్నట్లనిపించింది.

కళింగరావుకు ఇక పెళ్ళికాదనే భయం ఒక తుది స్వరూపం పొందింది. మరి ఎంతకని ప్రయత్నిస్తారు ఎవరైనా! అతని తండ్రి ఆ వ్యవహారాన్ని 'ఈశ్వరేచ్ఛకు' వదలి చేతులు ముడుచుకొని కూర్చొన్నాడు.

ఇలా ఉండగా కళింగరావు కాలాంతకుడని ఆఖరి ఘట్టంలో నిరూపించుకొన్నాడు. అకస్మాత్తుగా, ఒకరోజు ఎవరో చెప్పారు. కళింగరావు అంతర్ధానమయ్యాడని. నాలుగు రోజులనుండి కనుపించటంలేదట. వాడి తండ్రికి ఆపలేని దుఃఖం ముంచుకొచ్చింది! నాకట్టి ఆందోళనా కలుగలేదు. కళింగరావును గురించి భయపడటం తెలివితక్కువే అవుతుంది. ఎందుకంటే వాడు చిన్నపిల్లవాడు గాడు. తెలివితక్కువాడు కాడు. అమాయకుడు అంతకన్నా కాదు. అందరిలోకి నేనుమాత్రం ధైర్యంగా వున్నాను.

ఒకరోజు నాకు ఒక కవరు వచ్చింది. 'ఎవరిదగ్గరనుండి చెప్మా' అనుకొని చించి చూద్దునుగదా, కళింగరావు దస్తూరి. చాలా విచిత్రంగావుంది...

"డియర్ మిస్టర్ క్రిష్ణా! నన్నుగురించి ఎవరు ఏమనుకుంటున్నారో నేను వచ్చాక నాతో చెప్పుదువు గాని. ఇంతకీ నీ వేమనుకుంటున్నావోగదా! కొంత ఆలస్యంగానైనా, ఇప్పటికైనా మేలుకొన్నాను; నేను మొదటనుండీ ఒక తప్పు చేసాను. నీతో ఒక ముఖ్యవిషయం చెప్పలేదు. మా మేనమామ కూతురు ఒక అమ్మాయి వుంది. ఆ విషయం నాకు, నాన్నకుకూడా తెలుసు. మాకు ఏనాడో ఎందుకో విరోధాలు వచ్చాయి. అది పెద్ద ఆటంకమయింది. దేశమంతా కాలికి బలపం కట్టుకొని తిరగాను. అంతిచికాకుకలగటం నాకే మంచిదయింది. ఇప్పుడు మా మేనమామ ఎప్పుడూ రానినన్ను చూసేసరికి పాత పేచిలు మరచిపోయి ప్రేమతో స్వాగతమిచ్చాడు. ఇంట్లో పెట్టుకొని వూరంతా తిరిగినట్లు నేను చూడు ఎంతపని చేశానో! మరో ఒమంచిమాట. నా శ్రీమతి అంటే కాబోయే అర్ధాంగి–నాకు సూటబుల్, బ్యూటిఫుల్, మరీ 'మనిఫుల్' ఒకటి రెండురోజుల్లో వస్తున్నాను. స్వయంగా అన్నీ విన్నవించుకుంటాను. అంతవరకూ నా శుభాకాంక్షలు చెప్పు. టా టా! యిట్లు.

కం. కళింగరావు.

ఒక పెద్దబరువు దించినట్లయి మనస్సు తేలికపడింది. యీ విషయాన్ని కళింగరావు తండ్రికి చెపుదామని లేచేసరికి "ఏమండో క్రిష్ణగారు..."అంటూఆయ నే ప్రవేశించారు

"మనవాడు కొంప ముంచేశాడు..." అన్నారు ఆయన.

ఆయనకుకూడా ఒక ఉత్తరం వేశాడు!

"కొంప ముంచలేదు, పెట్టలేదు!కొంపలు కలిపాడు" అన్నాను నేను.

అంతా ఈశ్వరేచ్ఛ అనుకున్నాం.

కళింగరావుకు కళ్యాణపుగీత దగ్గరపడింది. మరి శుభలేఖలు అచ్చు వేయించటమే తరువాయి. 

# ఇప్పుడు నా ఉత్సాహమునకు అంతులేదు!






పరగడుపున ఈనో కొంచెము పెద్ద మోతాదు త్రాగితే అది సౌమ్యమైన విరేచనకారిగా పనిచేయును

## ఈనో కడుపులోని అస్వస్థతకు త్వరగా ఉపశమనము కలిగించును!

మీరు అజీర్ణపు బాధలతో బద్ధకముగా, లేక చిరచిరలాడుతూ ఉన్నా, లేక మితిమీరి తిన్నా, నీరసంగా ఉన్నా, ఒక గ్లాసెడు ఈనో ను త్రాగండి. మెరయుచు పొంగే ఈనో త్వరగా గుణము కలిగించుట ప్రారంభించి కడుపులోని బాధాకరమైన అమ్లములను పోగొట్టును, ఒంట్లో వేడిని తగ్గించును మరియు శక్తి ఉత్సాహములను తిరిగి యిచ్చును! ఈనో ను కుటుంబములో చిన్నా పెద్దా అందరూ వాడవచ్చును. అది త్రాగుటకు బాగుంటుంది మరియు సౌమ్యముగ, ఎంతో సామర్థ్యముగా అమ్లమును విరుస్తుంది. కడుపులోని అస్వస్థతలకు, అజీర్ణమునకు మరియు బద్ధకమునకు ఉపశమనము పొందుటకు ఈనో ను త్రాగండి!

## ఈనో 'ఫ్రూట్ సాల్ట్' నవోత్సాహమును కలిగించును!

'ఈనో' మరియు 'ఫ్రూట్ సాల్ట్' అను మాటలు రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కులు
గ్రూవ్ లేబొరెటరీస్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్



# నెమళ్ళ

అదొక పెద్దతోట. ఆ తోటలో ఒంటి స్తంభంమేడ. ఆమేడలోఅందాల చిన్నది. ఆ చిన్నదానిపేరు పద్మప్రియ.

అంత ఎత్తు మేడలోనూ పద్మప్రియ ఒక్కత్తే ఉంటుంది. అక్కడ ఆమెకి సాయానికి కెవరూ లేరు. పెంపుడుకుక్క మాత్రం ఒకటుంది. అది ఆమెకి ఏ అపాయమూ రాకుండ కాపాడుతూ ఉంటుంది. రోజూ పొద్దునపూట ఆమేడకి ఉన్న ఒకే ఒక తలుపుతెరుచుకుని ఒక దాసీది వచ్చి పద్మప్రియకి ఆ రోజుకి కావలసిన అన్నం, బట్టలు, ఇతర వస్తువులూ అక్కడ పెట్టి వెళ్లిపోతుంది. మళ్లీ తలుపులు వేసుకుంటాయి. అంతే. మళ్లీ పద్మప్రియా, పెంపుడుకుక్క తప్ప ఇంకెవరూ ఉండరు.

అప్పుడప్పుడు చిలకలు, గోరింకలు, పావురాలూ కిటికీదగ్గిర వాలి "పద్మప్రియా" అని పిలుస్తాయి. పద్మప్రియ వాటిని దగ్గిరకు తీసుకుని ముద్దాడుతుంది. ఆ పిట్టలు ఆమెతో కబుర్లు చెబుతాయి.ఎక్కడెక్కడో దూరదేశాల్లో జరిగిన కథలు చెబుతాయి.మళ్లీ వెళ్లిపోతాయి. ఏడాదికొకసారి ఆమె పుట్టిన రోజున ఆమె తలిదండ్రులు, ఇద్దరన్నలూ ఆమెని చూడటానికి వస్తారు. వాళ్లు ఆమెని చూసీ, ఆమె వాళ్లని చూసీ ఏడుస్తారు. కొంతసేపైన తరువాత వాళ్లు వెళ్లిపోతారు. పద్మప్రియ ఒంటరిగా ఒంటిస్తంభం మేడలో దిగులు పడుతూ ఉంటుంది.

ఎవరీ పద్మప్రియ? ఎందుకలా ఒంటి స్తంభం మేడలో ఉంటోంది? అదంతాఒకచిత్రమైనకథ.

ఆమె తండ్రి ఆదేశం ఏలే రాజుగారు. ఆ రాజుగారికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడి పేరు అజయుడు. రెండోవాడి పేరు విజయుడు. వీళ్లిద్దరి తరవాత చాలాకాలానికి రాజుగారికి ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ పిల్ల కొలనులో పొద్దున్నే విచ్చిన తెల్లటి తామరపువ్వులా ఉండేది. ముద్దొచ్చే ఆ మొహం చూసిచూసి రాణీగారు మురిసిపోయి పద్మప్రియ అని పేరుపెట్టింది.

పద్మప్రియ ఊరికే ధగ ధగమెరిసిపోతూ ఉండి, ఊరుకుంటే ఎవరికీ ఏ నష్టమూ లేదు. అలా కాకుండా ఒక చిక్కు తెచ్చిపెట్టింది. రాజుగారి ఆస్థానంలో ఉండే జ్యోతిష్కులు ఆ పిల్ల జాతకం చూసి కళ్లు చిట్లించి, అక్కడితో ఆగక పెదిమలు విరిచారు. 'ఏమిటేమిటి' అని రాజుగారు అడిగారు. చెబితే ఆయనకు ఏం కోపం వస్తుందో, ఏంబాధకలుగుతుందో అని వాళ్లు కిమిన్నాస్తిగా ఊరుకున్నారు. రాజుగారు ఇంకా గుచ్చి గుచ్చి అడిగారు. ఇక చెప్పక తప్పదని వారిలోకల్లా వృద్ధుడైన ఒకజ్యోతిష్కుడు సంగతి చెప్పేశాడు: "మహారాజా! ఈ పిల్ల నక్షత్రంలా మెరిసిపోతున్నమాట నిజమే కాని, పుట్టిన నక్షత్రం అంత మంచిది అనటానికి వీలులేదు. అందుచేత ఈమెవల్ల ఈమె అన్నలిద్దరికీ ప్రాణాలుపోవటం మొదలైన కొన్ని ఇబ్బందులు కలగవచ్చు."

ఇది వినేటప్పటికి రాజుగారి గుండెల్లో రథాలు పరిగెత్తాయి. తన తరవా తనరాజ్యానికి వారసు కావలసిన కొ

# రాజు

జి. భానుమతీదేవి



కులకు ఈ పిల్ల మూలాన ప్రాణహాని కలుగుతుందంటే ఆయన ఊరుకోగలడా? జుట్టు పీక్కుంటూ "ఏం చేయమంటారు దీన్ని? మేడమీంచి తోసేసి చంపనా, సముద్రంలో తోసేసి చంపనా?" అని జ్యోతిష్కుల నడిగాడు.

"అయ్యయ్యో, అంత పనిమాత్రం చెయ్యకండి. లేక లేక పుట్టిన ఆడపిల్లని చూసి రాణీగారు మురిసిపోతున్నారు. ఆవిడ ముద్దు ముచ్చటల్ని ముక్కచెక్కలు చెయ్యకండి," అన్నారు జోతిష్కులు.

"ఏం చెయ్యమంటారో చెప్పరేం?" అని రాజుగారు గద్దించారు.

వృద్ధ జ్యోతిష్కుడు హడిలిపోయి "కోటవెనకాల తోటలో ఒంటిస్తంభం మేడకట్టించి అందులో రాజకుమారిని ఉంచి ఎప్పటికీ కిందికి దిగిరాకుండా కాపలా పెట్టించి అన్నం నీళ్లు బట్టలు అన్నీ అక్కడికే దాసీలద్వారా పంపిస్తూ జాగ్రత్తగా వుంటే మీ కుమారులకు ఆ పిల్లవల్ల ఏ అపాయమూ కలగదు" అని అప్పటికప్పుడు నోటికొచ్చిన ఉపాయం గుక్క తిప్పుకోకుండా చెప్పేశాడు.

రాజుగారు తలుచుకుంటే మేడలకు కొదవా? ఉన్నపళంగా ఒంటి స్తంభం మేడకట్టించారు. అందులో పద్మప్రియను ఉంచారు. రాణీగారు లబ్బున గోలపెట్టిందిగాని రాజుగారు ఆమెనోరు నొక్కేశారు. కొడుకుల క్షేమంకోసం కూతుర్ని వదిలిపెట్టక తప్పదని చెప్పి ఒప్పించారు. కొన్నాళ్లకి ఆమె గుండెరాయిచేసుకుని ఊరుకుంది. ఏడాదికొకసారి అంతా వెళ్లి పద్మప్రియని చూసివస్తూ ఉండేవారు. బంగారపు పంజరంలో పంచరంగుల చిలకలా ప్రపంచమంటే ఏమిటో తెలియకుండా ఉంటున్న చెల్లెల్ని చూసినప్పుడల్లా అజయుడికీ, విజయుడికీ దిగులు రగులుతునేది.

ఇలా ఉండగా పౌర్ణమి రోజుకి చంద్రుడికి పదహారు కళలూ నిండినట్టు ఒకానొక రోజుకి పద్మప్రియకి పదహారేళ్లూ నిండాయి.

ఆ తరువాత కొన్నాళ్లకి రాజుగారికి, రాణీగారికీ ఇద్దరికీ పెద్ద జబ్బుచేసి, ఇద్దరూ ఒకరోజునే చనిపోయారు. ఈసంగతి విని పద్మప్రియ కుమిలి కుమిలి ఏడ్చింది.

దహనక్రియలన్నీ అయినతరవాత, జ్యోతిష్కులు నిర్ణయించిన మంచి ముహూర్తాన అజయుడికి పట్టాభిషేకం జరిగింది.

పట్టాభిషేకం అయిన మర్నాడు అజయుడు తమ్ముడైన విజయుణ్ణి పిలిచి "విజయా! ఇప్పుడు నేను రాజుని గనుక నామాటకి రాజ్యంలో తిరుగు లేదు, ఏంతలుచుకుంటే అది చెయ్యగలను. అవునా?" అన్నాడు.

చాలా ముఖ్యమైన విషయాన్ని ఒప్పుకుంటున్నట్లు గంభీరంగా "అవును" అన్నాడు విజయుడు.

"అయితే ఓపని చేస్తాను. ఏమిటంటే, మన అల్లారు ముద్దు చెల్లెలు పద్మప్రియ పుట్టినప్పటినుంచీ ఒంటి స్తంభం మేడలోనే ఉంది. మన క్షేమం కోసమని ఆమెకి నాన్నగారు చాలా అన్యాయం చేశారు.

# ★ నెమళ్ళరాజు ★

ఆ మేడలో ఆమె ఆనందం పట్టలేక ఎప్పుడూ నాట్యంచేస్తూ, పాటలు పాడుతూ వుంటుందనటానికి ఏ ఆధారమూ లేదు. పదహారేళ్ల పాటు మన చెల్లెలు ఒంటరి ఖయిదు అనుభవించిందంటే నా గుండె తరుక్కుపోతోంది. నేనామెని విడిపిస్తాను. మనతోపాటు మన భవనంలోనే ఉంచుతాను. చూద్దాం, ఏం ఆపద వస్తుందో!"

ఈ మాటలు విని విజయుడు అన్నకేసి నిర్ఘాంతపోయి చూశాడు. వెంటనే "అన్నా! నన్ను క్షమిస్తావా?" అన్నాడు.

"ఏం" అన్నాడు అజయుడు.

"ఇంతకాలం నువ్వు మామూలు పాదా మనిషివనుకున్నాను. నీలో రహస్యంగా, ఇంత దారుణమైన తెలివితేటలున్నాయని, నీహృదయం ఉండవలసినచోట మెత్తటి శిరీష పుష్పం ఉందని అనుమానించలేదు. అన్నా, నువ్వెంత మంచివాడివి! నేనందామనుకుంటున్న మాట నువ్వనేశావ్! పద, పద; పద్మప్రియను విడిపిద్దాం," అని విజయుడు అజయుణ్ణి తొందరపెట్టాడు.

వెంటనే ఇద్దరూ, భటులను వెంటపెట్టుకుని ఒంటిస్తంభం మేడకి వెళ్లారు. తాళాలుతీసి లోపల ప్రవేశించారు.

పద్మప్రియ పాపం ఒక మూల కూర్చుని బట్టలు కుట్టుకుంటోంది. అన్నలను చూడగానే లేచి గభాలున వారి కాళ్లమీద పడింది. వెక్కివెక్కి ఏడుస్తూ, అజయుడితో "అన్నా! నువ్విప్పుడు మహారాజువైనావు. నీ మాటకు తిరుగులేదు. నన్ని చెరనుంచి తప్పించు" అన్నది.

అజయుడామెని లేవదీసి, "చెల్లీ! ఏడవకు. నిన్ని చెరనుంచి తప్పించటానికే వచ్చాను. నువ్వికనుంచీ మాతోపాటే ఉందువుగాని. రాజుగారి కూతురు, రాజుగారి చెల్లెలు ఎంత సుఖంగా, ఎంత దర్జాగా ఉండాలో అలా ఉందువుగాని. రా," అని చెప్పి ఓదార్చాడు. చెయ్యి పట్టుకుని మేడనించి కిందికి తీసుకు వచ్చాడు.

పద్మప్రియ ఆ మేడ దిగిరావటం అదే మొదటిసారి. చుట్టూ విశాలమైన తోట. ఓః ఎన్ని పూల మొక్కలు, ఎన్ని పండ్లచెట్లు! ఎన్ని పక్షులు, ఎన్ని లేళ్లు, జింకలు! మేడ లోపల ఎంత చీకటిగా, ఇరుకుగా, దిగాలుగా ఉండేదో, బయట అంత విశాలంగా, వెలుతురుగా, సంతోషంగా ఉంది. ప్రపంచం ఇంత బావుంటుందా అని ఆశ్చర్యపడింది. అన్నీ వింతగా, కొత్తగా కనిపించాయి ఆమెకి. ప్రతి పువ్వూ వాసన చూసింది. ప్రతి పండూ కొరికి రుచి చూసింది. ప్రతి పక్షీ పేరూ అడిగి తెలుసుకుంది. ఆమె వెనకాలే ఇన్నాళ్లూ ఆమెకి తోడుగా ఉన్న పెంపుడుకుక్క వస్తోంది. దానికీ అంతా కొత్తగాఉంది. సంతోషం పట్టలేక అదీ గంతులేస్తోంది.

పద్మప్రియ పువ్వుల మొక్కల మధ్యనుంచి నడుస్తూఉండగా, ఉన్నట్లుండి ఒక అరుపు వినిపించింది. ఆమె చటుక్కున ఆగి, ఆ అరుపు వచ్చిన దిక్కు చూసింది. అక్కడ ఒత్తుగా పూచిన పొగడచెట్టుకింద ఒక నెమలి వుంది. అది పింఛం విప్పి రాజకుమారిని చూడగానే, ఆమె అందానికి ఆశ్చర్యపడినట్లు క్రేంకారం చేసింది. ఎప్పుడూ నెమలిని చూడని పద్మప్రియ కూడా దాన్ని చూడగానే, ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరై చప్పట్లు కొట్టింది. నెమలీ, రాజకుమారీ అలా ఒకరినొకరు చూసుకుంటూ ఉండిపోయారు.

ఆశ్చర్యంనుంచి తెప్పరిల్లి పద్మప్రియఅన్నలనడిగింది. "అదేమిటని," వాళ్లు అది నెమలి అనే పక్షి అని చెప్పారు. "ఈ నెమళ్లు చూట్టానికి చాలా అందంగా ఉంటాయి. కాని తింటానికి ఇంకా రుచిగా ఉంటాయి. అసలీ నెమళ్లు చూట్టానికి ఎక్కువ బావుంటాయా, తింటానికి ఎక్కువ బావుంటాయా అనేది సృష్టిలోని గొప్పరహస్యాల్లో ఒకటని నాన్నగారు అనేవారు. ఆయనకి నెమలి మాంసం బలే ఇష్టం. సంతోషంగా ఉన్నప్పుడు నెమలిమాంసం తినటం, నెమలిమాంసం తిని సంతోషంగా ఉండటం ఆయనకి అలవాటు," అని విజయుడు చెల్లెలికి వివరించాడు.

ఇంతసేపూ ఇది వింటూ నెమలిని రెప్పార్పకుండా చూస్తున్న పద్మప్రియ ముఖం కోపంతో జేవురిం

చింది. "ఏమిటీ? ఇంత అందమైన పక్షిని చంపితింటారా?" అని అరిచింది.

"చంపకుండా తినటం కష్టం," అన్నాడు విజయుడు.

"ఈ దారుణం నేను సహించను. అన్నా! ఇహానుంచీ ఈ రాజ్యంలో నెమళ్లను చంపటానికి వీల్లేదని ఆజ్ఞాపించు. నేను అసలు నెమళ్ల రాజునే పెళ్లాడతాను. ఇంకెవర్నీ పెళ్లాడను," అంది పద్మప్రియ.

గులాబీ రేకులు అంటించుకున్నట్టు, కోపంతో ఎర్రబడిన ఆమె బుగ్గల్ని చూసి అజయమహారాజు "చెల్లీ! నెమళ్ల రాజుని పెళ్లాడతావా? ఎక్కణ్ణించి తీసుకురాను నెమళ్ల రాజుని? అన్నాడు.

"ఎక్కణ్ణించి తెస్తావో తీసుకురా. నేనేమైనా సరే, నెమళ్ల రాజునే పెళ్లాడతాను," అని శపథం చేసింది పద్మప్రియ.

చెల్లెలిమాట కాదనలేక, "సరే అలాగే తీసుకువస్తా" అన్నారు అన్నలిద్దరూ. చెల్లెల్ని రాజభవనంలోకి తీసుకువెళ్లారు. ఆమె నెప్పుడూ చూడని పురజనులంతా ఆమె అద్భుతమైన అందచందాలు చూసి ముగ్ధులయ్యారు. ఆ స్థానంలో ఉన్న ఇద్దరు కవుల్లో ఒకడు "పదహారేళ్లు మబ్బుచాటున ఉన్న చంద్రబింబం ఇవాళ బయటికివచ్చింది" అని నుంచున్న పళంగా పద్యం అల్లేశాడు. అతడంటే పడని రెండోకవి "పదహారేళ్ల పాటు చంద్రబింబం మబ్బుచాటున ఎలాఉంటుంది, నీ మొహం!" అని కోపంగా ఇంకో పద్యం కష్టపడి రాశాడు. ఏమైతేనేం, పద్మప్రియను చూసి ప్రజలంతా సంతోషించారు.

చెల్లెలుకోరిక ఏమైనాసరే తీర్చి తీరాలని అజయవిజయులు నిశ్చయించారు. నెమళ్ల రాజు అనబడేవాడే నిజంగా ఉంటే, భూమిమ్మీద ఎక్కడున్నా సరే తీసుకువస్తామని ప్రతిజ్ఞ చేశారు. ఆస్థాన చిత్రకారుడి చేత పద్మప్రియ బొమ్మ గీయించారు. ఆ బొమ్మని చూసి మళ్లీ పద్మప్రియని చూడక్కర్లేదు. అంత చక్కగా ఉంది ఆ పటం.

ఆ పటం తీసుకుని రథాలెక్కి అజయుడు, విజయుడు దేశాంతరం బయలుదేరారు. రాజ్యభార మంతా మంత్రులకు, చెల్లెలికీ అప్పగించారు.

చాలారోజులు ప్రయాణం చేసి చేసి, ఎన్నో నదులు, అడవులు దాటారు. దోవపొడుగునా వాళ్లనీ వీళ్లనీ అడిగేవారు, "నెమళ్ల రాజు ఎక్కడుంటాడో తెలుసా?" అని. ఎవర్ని అడిగినా ప్రతివాడూ నవ్వేవాడు. "ఏ రాజు కొలువులో మీరు హాస్యగాళ్లు?" అని కొందరడిగేవారు. కొందరు నవ్వి నవ్వి తరవాత అయిదారు రోజులుదాకా కడుపునొప్పితో బాధపడేవారు.

అయినా అజయ విజయులు తమ పట్టుదల విడవలేదు. అలా పోయి పోయి కొన్నాళ్లకి సీతాకోక చిలుకల రాజ్యం చేరారు. అక్కడ ఎక్కడ చూసినా సీతాకోక చిలుకలే. పైకి చూస్తే అక్కడక్కడ ఆకాశమూ, మిగతాదంతా సీతాకోక చిలుకల మయమూ అయి కనిపించింది. అక్కడి ఆడవాళ్లూ, మగవాళ్లూ కూడా, సీతాకోక చిలుకల మల్లేనే రంగు రంగుల అంగీలు, లుంగీలు, లంగాలు, కట్టుకుని హాయిగా ఆడుతూ పాడుతూ కనిపించారు. అజయుడు, విజయుడు ఈ వింత రాజ్యం చూసి ఆశ్చర్యపోతూ పోతూ సీతాకోక చిలుకల రాజుదగ్గిరికి వెళ్లారు. ఆ రాజు వీరిని చాలా మర్యాదలు చేసి, కుశలప్రశ్నలు వేసి "ఎందుకు

(41-వ పేజీ చూడండి)

# విమానంకథ

పి. దక్షిణామూర్తి

(గతవారం తరువాయి)

ఒకాయన ఎలక్ట్రిక్ మోటారు అమర్చుకుని, ప్రొపెలరు తిప్పి గాలిఓడ మీద షికారు కొట్టేశారు. ప్రొపెల్లరు అంటే విమానాన్ని ముందుకు లాగేదన్నమాట. దీని అసలుపేరు ఎయిర్ స్క్రూ. అంటే మరమేకు, చెక్కలోకి దూల్చుకు పోయినట్లు ఈ ఎయిర్ స్క్రూ గిరగిర తిరుగుతూ గాలిని తోసుకుంటూ ముందుకు వెళ్ళిపోతుంది. ఇది మళ్ళీ తరవాత చెబుతాలే.

మొత్తంమీద ఈ తరహా గాలిఓడలలో అందరికన్న మంచిఓడ కట్టింది ఫ్రెంచి వాళ్ళు. ఫ్రెంచిప్రభుత్వం ఆ రోజుల్లోనే ఏకంగా, తన సైన్యంలో విమానదళంఅంటూ ఒకటి ఏర్పాటు చేసేసింది. మరి ఇది శత్రువుల నెత్తిమీద ఎగిరి వాళ్ళసంగతులు తెలుసుకోడానికి ఎలాగా పనికొస్తోందిగా. కెప్టెన్ రెనార్డ్, కెప్టెన్ క్రెబ్స్ అనే ఇద్దరు ఒక పెద్దగాలిఓడ కట్టారు. నూటయాభై అడుగుల పొడుగు. చేప ఆకారం. మిగతా వాళ్ళలా దీనికి ప్రొపెల్లరు (ఎయిర్ స్క్రూకు) వ్రేలాడగట్టకుండా దాని ముక్కుకే అమర్చి బిగించారు. ఇది విద్యుచ్ఛక్తితో తిరిగేది. గాలిలోకి తేలిన ఈ బెలూనుని, ఈ ఇంజన్ గంటకి 14 మైళ్ళ వేగంతో నడిపించింది.! ఈ గాలి ఓడకి పుట్టినరోజు పండుగచేస్తే జూన్ 5న చెయ్యవచ్చు. 17౬8 వ సంవత్సరం జూన్ 5న ఇది బాగా ఎగిరి, 'ఓడ' అనిపించుకుంది. దీనికి పుట్టిల్లు ఫ్రాంసు. ఆ రోజునించి వందసంవత్సరాలదాకా ఇది 'పుట్టినింటే' పెరిగింది. ఇతర దేశాలకన్న ఫ్రెంచి వాళ్ళే దీన్ని ఎక్కువ బాగా వాడుకున్నారు. ఎన్నో కొత్తవి చేశారు. ఎంతో దూరం ఎగిరారు. ఆ తరవాత జర్మనీ పుంజుకుంది. జర్మనీ అనడంకన్న జెపిలిన్ అని చెప్పడం న్యాయం. ఎందుకంటే ఆయననే ఇందులో బోలెడు ఘనమైన పనులుచేశాడు. ఈ జెపిలిన్ బాగా డబ్బున్న వాడు. బుర్ర ఉన్నవాడు. తెంపరి. యుద్ధశాస్త్రం బాగా తెలుసు. ఈయన పూర్తి పేరు ఫెర్డినాండ్ వాన్ జెపిలిన్.

జెపిలిన్‌కు ఈ పెద్ద బెలూన్లు ఇలా ఎగరడం నచ్చలేదు. దానికి ఏ మూల చిన్న చిల్లుపడినా అదీ మనిషీకూడా పేలిపోతాయగదా. అందుకని ఈయన కొత్తపద్ధతి కనిపెట్టాడు. ఈ గాలిఓడకి ముందర అల్యూమినియంతో చట్రం కట్టాడు. దానిమీదగట్టి సిల్కుబట్టని బిగించాడు. ఆలోపల అంతా చిన్న చిన్న హైడ్రోజన్ బెలూన్లు వందలకొద్దీ ఎక్కించి నింపేశాడు. ఇలాఅయితే, ప్రమాదంవల్ల ఒకబుడగ పేలిపోయినా ప్రమాదం



ఆకాశంలో గాలిఓడ ఇలా కూడాఉండేది. టోపీ ఆయన, పడవవాడిలా గాలిలో తెడ్డు వేస్తున్నాడు. ఇబ్బంది వచ్చి ఆగాలంటే, లంగరుకూడా ఉంది.

లేదుగదా. ఇంకా కొన్నివందల బెలూన్లు అలాగే ఉండి ఓడని మోస్తాయి.

ఏం. ఈఓడకి రెండు ఇంజన్లు తగిలించాడు. వాటితో నడిపేసరికి ఈ గాలిఓడ గంటకి 18 మైళ్ళ వేగంతో ఎగిరింది. అంతేకాదు ఎటు వెళ్ళమంటే అటుతిరిగి చెప్పినట్టువింది. మంచిబాలుడు రాములా. జెపిలిన్ ఓడచేసేసరికి జర్మనీలో అందరికీ మంచి హుషారు వేసుకొచ్చింది. అదిచూసి, ఇంకా అలాటివి అంతకన్న మంచివి వందలకొద్దీ కట్టేశారు. కొద్ది కాలంలోనే జర్మనీ దేశానికికూడా పెద్ద విమానబలం ఏర్పాటయిపోయింది. జెప్పెలిన్‌కుండా పెద్దఫ్యాక్టరీ పెట్టి మంచి మంచి విమానాలు తయారు చేయించాడు. ప్రపంచమంతా వీటికి పేరు వచ్చింది. మొదటి ప్రపంచయుద్ధకాలంలో ఇవి బ్రిటన్‌మీదకి జోరుగాఎగిరి దాడిచేసి వచ్చాయి. డజనుమంది మనుషుల్నీ బాంబుల్నీ కూడా మోసుకుపోయేవి.

ఇక్కడికిదంతా ఒకకథ. ఇది బెలూన్ల కథ. ఇంక విమానాలకథ చూదాం.

కాశీ మజిలీలో కథలు చదివావా? వాటిలో రాజకొడుకు, మంత్రికొడుకూ, వాళ్ళూ దేశాంతరలు బయల్దేరి ఓ పెద్దచెట్టు దగ్గిరికి వస్తారు. దానికి రెండుకొమ్మలు చాలా పెద్దవి ఉంటాయి. రాజకొడుకు తూర్పువైపు కొమ్మఎక్కి అలాపోతాడు. అపుడు రాజకుమారి కనిపిస్తుంది. బోల్డుకథ. ఆలాగే ఇటు మంత్రికొడుకు దక్షిణం వేపు కొమ్మమీద పోగా పోగా మంత్రికుమార్తె కనిపిస్తుంది. అదంతా ఇంకోకథ. విమానంకథా కొంచెం అలాగే నడిచింది.

బెలూన్ల సహాయంతోటే ఆకాశంలో మనిషి ఎగరాలి అనుకున్న వాళ్ళందరూ ఇటు వేపు ఇంత హడావుడి చేస్తూవుంటే, మరికొందరుఇంకో రోడ్డుచ్చుకు బయల్దేరారు. వాళ్ళు ఎకాయెకిని, ఇపుడు మనం చూసేరకం విమానాలే చెయ్యాలి అని తిప్పలుపడ్డారు. బెలూన్‌తో ఎగిరేవాళ్ళు ఇటు ఎంతో దూరం పోతే, విమానాలవాళ్ళు అటూ ఇంకెంతో దూరం పోయారు. తరవాత ఇద్దరూ ఒకరొకరు చూసుకుంటూ ఇంకొంచెం దూరం వెళ్ళారు. చివరకి, "ఈ బెలూన్లకన్న విమానాలే బెస్టు" అనేశారంతా.

పక్షి ఈకలతో రెక్కలుచేసి అవి తగిలించుకు ఎగరడం పాత ఫాషన్ అయిపోయి, బెలూన్‌తో ఎగరడం కొత్తఫాషనుగా వచ్చిన రోజులలోనే వాళ్ళకీ వీళ్ళకీ పేచీలు వచ్చాయి.

"గాలికన్న తేలిక అయినదే గాలిలో తేలి పైకి లేస్తుంది. ఆ తరవాతనే మనం ఎన్ని ఆటలు ఆడినా సాగేది" అని బెలూన్ మతం వాళ్ళు అన్నారు.

"అదేం కాదు. లేవోయి పుల్లయ్యా! గాలికన్న బరువైనవి తేలుతాయి ఆ బరువు లెక్కవేసే పద్ధతి వేరూ" అని విమానాలవాళ్లు వాదించారు.

బెలూను మతంవాళ్లు యీ మాటలు నమ్మలేదు. వీళ్ళు ఉట్టి వెర్రి వెంగళాయిగాళ్ళు అనుకుని, మళ్ళీ ఇంకో బెలూను ఎగరేసుకోడానికి పోయారు.

విమానాలవాళ్ళు మాత్రం తమ పని మానలేదు. సరిఅయిన పద్ధతిలో విమానం కట్టి దానికి ఇంజను పెట్టి, గాలిగుణాలు, అందులో సుళువు తెలుసుకుని ఎగరేస్తే గాలికన్నా బరువైనవి తప్పకుండా ఎగురుతాయని వాళ్లకి గట్టినమ్మకం ఉంది.

నమ్మకం ఉందిగాబట్టి ప్రయత్నం చేశారు 'ఆ సరియైన పద్ధతి' తెలుసుకోడానికి.

ఒతాళం చెవి పోయిందనుకో తాళం కప్ప బద్దలుకొట్టకుండా పెట్టె తెరవాలంటే పాతతాళం చెవులన్నీ వెతికి తెచ్చి వాటిలో దేంతోనైనా ఇది వస్తుందా అని చూస్తాం. సరిఅయిన చెవి దొరికేదాకా అది రాదుగదా. ఈలోగా మనం అక్కడ కూర్చుని జుట్టు పీక్కున్నా, పిల్లి మొగ్గలు వేసినా, తేలు మంత్రం చదివినా, ఆఖరికి సినిమా పాటలు పాడినా కూడా అది రాదు. సరియైన పద్ధతి తెలియాలి.

దేవుడు గాలికీ, నీటికీ, మట్టికీ నీకూ, నాకూ, రాయికీ, రప్పకీ, కప్పకీ అందరికీ శక్తిని ఇచ్చాడు. ఆ శక్తిని ఎలా వాడాలో తెలుసుకుంటే అది మనకి గొడ్డు చాకిరీ చేస్తుంది. పంకా ఉందనుకో. అంది ఎంత చల్లగా హాయిగా గాలి విసరగలదో స్విచ్ నొక్కితే తప్ప తెలీదుగదా. చేత్తో తిప్పితే ఏం లాభం.

అదన్నమాట. ఇంకోటికూడా ఉంది. ఈ శక్తి కీలకం తెలుసుకోవడంలో ఒకొక్కసారి తప్పుదారికి పోయామనుకో. అది మీద పడి మనని చితగ్గొట్టేస్తుంది. దానికి జాలిగీలీ లేవు.

నీళ్ళలో శక్తి బోలెడుంది. వరదలొస్తే ఆపలేం. ఊళ్ళన్నీ మునిగిపోతాయి. మరి ఆ నీటికే ఆనకట్ట కడితే, దానితో ఎంతో గమ్మత్తు చెయ్యొచ్చు. విద్యుచ్ఛక్తి పుట్టించవచ్చు. దానితో ఎన్నో మరలు నడపవచ్చు. గాలి శక్తితో గాలి మరలు తిప్పేవాళ్ళు పూర్వం. ఇప్పుడు విమానాలు నడుపుతున్నాం. అలాగే ఏదైనా అది తెలుసుకోడానికి నానాతిప్పలూ పడాలి. ఎంతోమంది దాని కోసం ప్రాణాలు అర్పిస్తారు. బతికున్నవాళ్లు అనేకరకాల పనిపెట్టుకుని ఆపనే చేస్తూ ఎప్పుడో చచ్చిపోతారు. తపస్సు చెయ్యగా చెయ్యగా దేవుడే దిగివస్తాడు గదా. అలాగే ఒకదానిమీద దృష్టిపెట్టి శ్రమపడితే దాని రహస్యం తెలుస్తుంది. ఇది తపస్సే. దానికి ఒకరు చాలకపోవచ్చు. వందమంది కావలసి రావచ్చు. ఒక ఏడాది చాలకపోవచ్చు. నూరేళ్లు పట్టవచ్చు, ఇంకా ఎక్కువా కావచ్చు.



బెన్ ఫ్రాంక్లిన్‌ను చెరువు దాటించిన గాలిపడగ.

# ఇప్పటి విమానాల అప్పటి కథ

అనగనగా అమెరికాలో బోస్టన్ అనే ఒక ఊరు. అది ఇప్పుడూ నిక్షేపంలా ఉందిలే. 230 ఏళ్ళ క్రితం ఒకరోజు సాయంకాలం ఆ ఊరి చివర చెరువుదగ్గర పాతిక ముప్ఫయి మంది బడిపిల్లలు చిన్నా పెద్దా గుంపు చేరారు. ఆ చెరువు చాలా పెద్దది. దాదాపు మైలు వెడల్పు. చెరువులో పన్నెండేళ్ళ కుర్రాడొకడు ఒడ్డుకు దగ్గరగా కూర్చున్నాడు. గట్టుమీద ఇంకో కుర్రాడు పెద్ద గాలిపడగ ఎగరేశాడు. అదిబాగా పుంజుకుని ఆకాశంలో స్థిమితంగా నిలబడేదాకా చూసి తరవాత దారపు ఉండ కడ్డీని ఆ చెరువులో కుర్రాడి చేతికిచ్చాడు. ఆ పళంగా ఆకుర్రాడు కొంచెం లోతుకినడిచి వెల్లికిలా పడుకున్నాడు. ఇంకో క్షణంలో కాళ్ళూ చేతులూ బాదే అవసరం లేకుండానే ఆకుర్రాడు చిన్నసైజు తెప్పలా తేలుతూ అవతలగట్టువైపు వెళ్ళడం ప్రారంభించాడు.

"బెన్ కాళ్ళు చేతులూ అసలు కదపడం లేదు. గాలిపడగే వాణ్ణి లాగేస్తోంది" అంటూ చెరువుగట్టుమీది పిల్లలంతా ఆశ్చర్యపడుతూ చప్పట్లుకొడుతూ చంకలెగరేస్తూ అరవసాగారు.

చెరువులో కుర్రాడు కొంచెంసేపటిలో అవతలగట్టుకి హాయిగా చేరిపోయాడు.

"ఎలా ఉందిరా బెన్?.. గాలి పడగేలాగిందా?" అని కుర్రాళ్లంతా కుతూహలంగా అడిగాడు.

"బేషుగ్గా ఉంది. భలేగా ఉంది. తమాషాగా ఉంది. గాలిగట్టిగా వీసినప్పుడు అది నన్ను గబగబా లాగింది. గాలిజోరుతగ్గితే నాజోరూ తగ్గింది. నాకు జోరుగా వెళ్లాలనిపించినప్పుడు దారం బిగలాగేవాణ్ణి. పడగ పుంజుకునేది. జోరుమరి హెచ్చిపోయి భయంవేస్తే దారం బాగా వదిలేవాడిని. అంతే [illegible] వేగం తగ్గిపోయేది. భలేగా ఉందిలెండి యాత్ర" అన్నాడు ఆ కుర్రాడు.

గాలిబలం, గాలిగుణం, దానిలోసుగులూ ఇంత తేలిగ్గా కనిపెట్టేసి స్పష్టంగా చెప్పేసిన ఆ కుర్రాడి వయస్సు పదిహేను సంవత్సరాలు ఉంటుందేమో.

ఆ అబ్బాయి పేరు బెంజమిన్ ఫ్రాంక్లిన్. 1770 లో కాబోలు బెన్ ఈ సంగతులు కనిపెట్టాడు.

ఇది జరిగిన 174 సంవత్సరాల తరవాత బేడెన్ పవెల్ అనే ఒక పెద్దమనిషి గాలిపడగచేత ఒక మనిషిని పైకి ఎత్తించగలిగాడు. స్కౌటు సంఘాలు మొదలుపెట్టినది ఈయనే.

33 అడుగుల ఎత్తున ఒక పెద్ద గాలిపటం కట్టి ఈయన ఎగరవేశాడు. దానితోకకి— చాలా పెద్దతోక అన్నమాట. ఓ బుట్ట కట్టాడు. అందులో ఒక అబ్బాయిని కూర్చోపెట్టాడు. దారం కొంచెం బిగలాగి జోరుగా వదిలేసరికి పడగ ఇంకొంచెం పైకి ఎగిరింది. అమాంతంగా దానితోకకి కట్టిన బుట్ట— అందులో మనిషితోకూడా పైకి లేచింది!

ఈ బేడెన్ పవల్ బెలూన్ మతంవాళ్లకి శుద్ధ విరోధి. సరే ఇలా ప్రయత్నాలు చేశాడు ఒకసారి. ఆ చిన్న చిన్న గాలిపడగలు బోలెడు జతకట్టి వాటితోకల కొసలన్నీ కలిపాడు. అక్కడనుంచి ఒక తాడు వేళ్లాడ కట్టి దానికో బుట్ట కట్టి అందులో మనిషిని కూర్చోమన్నాడు.

ఈ పద్ధతివల్ల ఆ గాలిపడగలన్నీ కలిసి మనిషి కూర్చున్న బుట్టని నూరు అడుగుల ఎత్తుకి తీసుకు వెళ్లాయి. ఆస్ట్రేలియాలో హాక్‌గ్రేవ్ అనే ఆయన గాలి పడగలతో ఒక పెట్టె చేశాడు తమాషాగా. దాన్ని పుచ్చుకు వేళ్లాడి కొంచెం పైకిఎగిరాడుకూడా.

అయితే ఒక విషయం. ఈ తమాషాలూ తతంగాలూ, కథ, కమామీషూ అంతా గాలి జోరుగా ఉన్నప్పుడే జరిగేవి. ఎగరాలనుకున్నవాళ్లు గాలికోసం తపస్సుచేస్తూ కూర్చునేవారు.

ఒకరోజున బేడెన్ పవల్‌కి ఒక ఊహ తట్టింది. ఆవేళ గాలి వీచడంలేదు. ఉక్కపోసే స్థితిలో ఉంది వ్యవహారం. పవల్ గాలిపడగ తెచ్చాడు. ఆ పళంగా రెండు గుర్రాలికి కాడివేసి గాలిపడగ దారాన్ని దానికి కట్టాడు. కొరడా పుచ్చుకొని చెళ్లున ఒక్కటి తగిలించాడు. గుర్రాలు ఝామ్మని పరిగెత్తేసరికి గాలిపడగ రివ్వున ఎగిరింది.

(ఇంకా వుంది.)

# బాలల సంఘం
# కొందరు సభ్యుల పేర్లు

ఓరుగంటి వెంకటరావు (కాళహస్తి, చిత్తూరు జి॥) వలివేటి ఆదిలక్ష్మీ కామేశ్వరి (కాజ, గుంటూరు జి॥) వందిరాజు శ్రీనివాసు (ఏలూరు. ప.గో. జి॥) దూసప్రమీలాబాయి (శికింద్రాబాద్) యం. శేఖరాణి (హైదరాబాదు) గిరిశా రామకృష్ణారెడ్డి (కడప) సన్నిధి నాగభూషణ రాజేశ్వరప్రసాద్ (అకివీడు. ప గో. జి॥) బి. యస్. హరి (ఉయ్యూరు, కృష్ణాజిల్లా) కొమ్మారెడ్డి బసవపూర్ణమ్మ (అయితా నగర్, గుంటూరుజిల్లా) కొల్లూరిజయలక్ష్మి (హైదరాబాదు) గంధి సుభాష్ చంద్ర (ఏలూరు, ప. గో, జి॥) చిలుకూరి అచ్యుతరామకృష్ణ (తిరుపతిపురం, ప. గో. జిల్లా) టి. జగన్నాధశర్మ (నంద్యాల, కర్నూలు జి॥) అందవోలు సుబ్బలక్ష్మి (సంగారెడ్డి. మెదక్ జిల్లా) కొల్లూరి ఉమామహేశ్వర శాస్త్రి రాజమండ్రి, తూ. గో. జిల్లా). వేదుల కృష్ణారావు (విజయనగరం, విశాఖ జిల్లా) కోట్ల వెంకట రామారావు (దే.వ. ప. గో. జిల్లా)

పోతుకూచి రఘురామశర్మ (అద్దంకి, గుంటూరుజిల్లా) గౌరాబత్తిన ప్రసాదరావు (పాటూరు, నెల్లూరుజిల్లా) బలిజేపల్లి వెంకట గౌరి ప్రసాది (రాయగఢ కోలాపుట్ జిల్లా) సి. యస్. కృష్ణమూర్తి (మదనపల్లి, చిత్తూరుజిల్లా) నోరిహయగ్రీవశాస్త్రి (రేపల్లె, గుంటూరుజిల్లా) తిపిర్తి వెంకటలక్ష్మి వసుంధరాదేవి (రేపల్లె గుంటూరుజిల్లా) మునునూరి సుబ్బలక్ష్మి (విజయవాడ) అద్దేపల్లి కామేశ్వరి (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) అద్దేపల్లి రాజరాజేశ్వరి (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) కొడాలి మురళీమోహన్ (దుగ్గిరాల, గుంటూరుజిల్లా) మోరంపూడి వీరయ్యశాస్త్రి (గ. మేడపాడు, తూ. గో. జిల్లా) చామర్తి వెంకటరత్నం. కాకినాడ తూ. గో. జిల్లా) ఏలూరిపాటి సుభద్రాదేవి (పాలకొల్లపేట, ప. గో. జిల్లా) నన్నపనేని రఘునాథ్ (నిడుబ్రోలు, గుంటూరుజిల్లా) పరిమి శ్యామల శ్రీ రాజ్యం (గుంటూరు) అల్లిక మీనబాబు (విజయనగరం) యడ్లా వెంకటేశ్వర్లు (తెనాలి, గుంటూరు జిల్లా) మంచం శ్రీరామ చంద్రమూర్తి (భీమడోలు, ప. గో. జిల్లా) రాయసం సీతాదేవి (భీమవరం, ప. గో. జిల్లా) పొత్తూరి లలితకుమారి (ఉంగుటూరు, కృష్ణా జిల్లా)

కేసానుపల్లి ఉమాబాల (ఒంగోలు, గుంటూరుజిల్లా) బొద్దనపల్లి శీతారామచంద్రరావు (ఆగిరపల్లి కృష్ణాజిల్లా) కోట మధుసూధనరావు (మచిలీపట్నం, కృష్ణా జిల్లా) సుంకర సత్యనారాయణమ్మ (రాజమండ్రి తూ గో జిల్లా) బొమ్మిడిబుల్లి అప్పారావు (పిఠాపురం, తూ గో జిల్లా) యల్లాప్రగడ నరసింహసారధిబాబు (మచిలీపట్నం, కృష్ణా జిల్లా) కందిబండ రామగోపాల్ రావు సూర్యాపేట, నల్లకొండజిల్లా) ధర్మవరపు ఇందిరదేవి (నరసరావుపేట, గుంటూరు జిల్లా) మాచిరాజు ప్రసూనాంబ (సంతిరావూరు, గుంటూరుజిల్లా) నాగమోతు శ్రీహరినాథ్ (శలపాడు, గుంటూరుజిల్లా) పల్లా రామకృష్ణ (కొవ్వూరు, ప గో జిల్లా) పల్లా సత్యశేషరమణ (కొవ్వూరు, ప గో జిల్లా) కుప్పిలి లక్ష్మణరావు పట్నాయక్ (విజయవాడ) మోగుకూరి వెంకటసుబ్రహ్మణ్యం (ప్రక్కిలంక, ప గో జిల్లా) శిరివెళ్ళ నరసింహారావు (ఒంగోలు, గుంటూరు జిల్లా) చాగంటి అరుణకుమారి (గొల్లపల్లి, తూ గో జిల్లా) కొదమసింహం వెంకటమురళీకృష్ణ (తిగువూరు, కృష్ణాజిల్లా) వెన్నేటి సత్యనారాయణ (కొలమూరు, తూ గో జిల్లా) బి. జె. మోహన్ (నెల్లూరు) అరుమిల్లి రా... లక్ష్మి (తణుకు ప. గో జిల్లా)

అనంతాత్మకుల శ్రీరంగారావు (మాచర్ల తూ. గో. జిల్లా) గువ్వూరి శ్రీరామమూర్తి చోడవరం, విశాఖజిల్లా) పాలూరి మాణిక్యాంబ (విశాఖపట్నం) అమిరపు అరుణకుమార్ (హైద్రాబాదు) షేక్ గడేసాహెబ్ (దూదేకులపల్లి, చిత్తూరుజిల్లా) శెనక్కాయల శోభ (కడప) బులుసు బాల లలితాదేవి (విశాఖపట్నం) శిరం ఇందిర (బొబ్బిలి శ్రీకాకుళం జిల్లా) ఎరుకలపూడి హేమలతాదేవి (పూనా,) పి కె వసంత (శికింద్రాబాదు) చావలి విశ్వేశ్వరరావు (కదిరి, అనంతపురంజిల్లా) జె జి. లక్ష్మీనారాయణ బాబు (ఇ. తాండ్రపాడు, కర్నూలుజిల్లా) యల్లాప్రగడ వెంకటరమణమ్మ (నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా) పింగళి చక్రపాణి (హైద్రాబాదు) వైట్ల వీరవెంకట సత్యవతి (వాకతిప్ప తూ గో జిల్లా) కొగుపిల్ల ఆనందరావు (వాకతిప్ప, తూ. గో. జిల్లా)



రంగులరాట్నం-13. వాల్ట్ డిస్నీ




"అంత చేటు తినొద్దు, లావెక్కుతావని ఎందరు చెప్పినా వింటేనా?"

# ★ అన్వేషణ ★

(19-వ పేజీ తరువాయి)

హోటలు యజమాని చెప్పిన వీధిలో ఆ నెంబరుయిల్లు చివరకు కనిపించింది. ఎంతో ఉత్సాహంగా ధైర్యంగా గుమ్మం ఎక్కాడు. తలుపులు మూసిఉన్నాయి. గట్టిగా తలుపుకొట్టాడు శివరాం. ఒకనిమిషం సమాధానం రాలేదు. "కౌన్ హై" అంటూ అరుపు వినిపించింది. రెండవసారి తలుపు బాదగానే ఏదో స్త్రీ కంఠంలా వినపించగానే, శివరాం కొంచెం జంకాడు. అయినా ఆఫీసుల్లో స్త్రీలు పనిచేసే యీ మహానగరంలో అంత భయపడవలసినపని లేదనుకుని సమాధానపరుచుకున్నాడు శివరాం. గాజులు ఘల్లుమనే శబ్దంతో శ్రుతికలిపింది తలుపు కిర్రుకిర్రు ధ్వనిపరదాలో పటుత్వంగా నిలుచుంది ఒకదీర్ఘమైన నల్లని ఆకారం. చిన్న గళ్ళసందుల్లోంచి మెదిలాయి కనుపాపలు. "క్యాహై, కౌన్ హై, క్యా బాత్ హై" రాళ్ళవానలా మాటలు దూసుకువచ్చాయి ఆమెనోటినుంచి. కొత్తహిందీఅర్థం ఎరిగిన శివరాం ఆమె మాటలకు భయపడ్డాడు. ఉద్యోగంకోసం వచ్చానని సవినయంగా మనవిచేసుకున్నాడు "నువ్వు యీ జెళా పక్కింట్లో మనిషివి"అంటూ భళ్ళున తలుపు వేసేసింది కుపితయైన ఆ వనిత. ఆ ఇంటి నెంబరు తనవైపు వెకిలిగా హేళనచేసినట్లనివ్వింది. భళ్లుమని మూసిన తలుపు మీదకు విసిరిన దుమ్ము కొంచెం దులుపుకుని ఆనాటి ఘన కార్యానికి జరిగిన పరాజయానికి తనలో తనే ధైర్యం చెప్పుకుంటూ, నిర్లిప్త్యంగా, హోటలు గది చేరుకున్నాడు శివరాం. వార్తాపత్రిక ప్రకటనలోని మోసం యొక్క అంతరార్థమేమిటో అతనికి బోధపడలేదు.

రాత్రి భోంచేసి తన మంచంమీద కూర్చుని పరుపుచుట్టలో దాచుకు తెచ్చుకున్న షేక్స్‌పియర్ నాటకం ఒకటి తీశాడు చదువుకుందామని, పుస్తకాలు యిచ్చే సిద్ధాంతాలకి, మానవుడు జీవితంలో విజయం పొందడానికి చాలా భేదం ఉందనిపించింది. రచయితలు తమ అనుభవ జ్ఞానాన్ని వ్రాతపూర్వకంగా అందిచ్చినప్పుడు చదివి ఆనందించటమే కాని, దాన్ని మానవుడు జీవితంలో ఏ విధంగానూ ఆచరణలో పెట్టుకోలేక పోతున్నాడనేది మాత్రం సత్యం. సిద్ధాంతాలు, నీతులు మనం చేసుకుంటూ కూర్చోటం కంటె, ఆచరణలో వాటిని ఆధారం చేసుకుని అనుభవం సంపాదించుకోవాలి. పుస్తకం మూసేసి, ఇంతవరకు గదిలోని మిత్రులను పరిచయం చేసుకోకుండా ఉన్నందుకు, కించపడి, ఫైల్సు వ్రాసుకుంటున్న తాతగారి దగ్గరికి వెళ్ళి కూర్చున్నాడు శివరాం. సవినయంగా తనపేరు చెప్పుకున్నాడు.

"చూస్తున్నా మిమ్మల్ని!" కళ్ళజోడు తీసి కిందపెట్టాడు ఆ ముసలాయన.

శివరాం తన పరిస్థితులు క్లుప్తంగా మనవి చేసుకుని, ఎక్కడైనా ఉద్యోగం ఖాళీ ఉంటే చెప్పమని ప్రాధేయపడ్డాడు.

ముసలాయన ఆలోచించి ఒక కంపెనీ చిరునామా వ్రాసియిచ్చి మర్నాడు కలుసుకుని ప్రయత్నించమన్నాడు.

మౌనంగా కూర్చుని, చుట్టూ ఉన్న వాతావరణంలోని విలువులను అర్థంచేసుకోకుండా, అందనివాటికి విచారిస్తూ నిరాశగా బ్రతికే నిర్భాగ్యుని జీవితమంతా ఖేదమయంగానే ఉంటుంది. తనకవసరమైనవన్నీ విధినిఅనుసరించి తనముంగుకే వస్తాయనే సంగతి మనిషి విస్మరించాడు. శివరాం తన పరిస్థితిలోంచి ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించుకున్నాడు.

మర్నాడు మామూలు పద్ధతిలో నిరుద్యోగిగా వినాయక రెడ్డిఆఫీసులో ప్రత్యక్షమయ్యాడు శివరాం. లావుగా బొద్దుగా, నల్లగా, గుండ్రంగా పెద్ద బొజ్జతో తన ఆఫీసుగదిలో కూర్చుని కాగితాలు వ్రాసుకుంటున్నాడు రెడ్డి. వచ్చిన శివరాంవైపు ఎగాదిగా చూశాడు.

"ఏవూరు?"

"గోదావరి ప్రాంతం"

"టైపు చెయ్యటం తెలుసా?"

"పరీక్ష కూడ ప్యాసయ్యాను"

రెడ్డి శివరాంను కూర్చోమని ఎదురుగాఉన్న కుర్చీ చూపించాడు. పాలపిట్టరంగులో గది గోడలన్నీ అందంగా పరిశుభ్రంగా ఉన్నాయి పెద్ద మేజాబల్ల, అందమైన కలం, సిరాబుడ్డి, ఆల్విన్ బీరువాలు, గాంధీ నెహ్రూల పెద్దఫోటోలు, నెత్తిమీద గిర్రున తిరుగుతున్న ఎలక్ట్రిక్ ఫాన్, కాకీరంగు బట్టల్లో నిలబడి నమ్రతగా పనిచేస్తున్న నౌకర్లు...ఆ ఆఫీసు పరపతిని హెచ్చిస్తున్నాయి.

నాల్గుపేజీల వ్రాతప్రతి టైపుచెయ్యమని శివరాంను ఆజ్ఞాపించాడు రెడ్డి. నౌకరు టైపురైటరుదగ్గరకు తీసుకువెళ్ళాడు. కాగితాలు టైపుచేసి తిరిగి రెడ్డిముందు నిలుచున్నాడు శివరాం.

రెడ్డి టైపుచేసిన కాగితాలు ఒకనిమిషం చదివాడు.

"ఏం చదువుకున్నావు?"

"బి. ఏ." నిశ్చలంగా సమాధానమిచ్చాడు శివరాం.

"బి. ఏ?!" ఒక్కసారి ఆశ్చర్యంగా నోరు ఆవలించాడు రెడ్డి, అంత చదువుకున్నవాడు టైపిస్టుగా పనిచేస్తాడా అనుకుని.

"ఎంతజీతం కావాలి?"

"మీ యిష్టం."

"ఒక వందరూపాయలు యిస్తా. నివసించడానికి గది ఉచితం! వినాయకరెడ్డి ఠీవిగా కుర్చీలో నిండుగా ఒరిగి గిర్రున తిరిగాడు బొజ్జ నిమురుకుంటూ."

ఏదో ఉద్యోగం దొరికితే చాలనుకుంటున్న శివరాంకు అది చాలా మంచి అవకాశమనిపించింది. బసకూడ ఉచితంగా సమకూర్చబడడం తన అదృష్టమే అనుకుని ఉద్యోగం చెయ్యడానికి ఒప్పుకున్నాడు.

మర్నాడు వినాయక రెడ్డి ఇంట్లోకి తన బెడ్డింగుతో వచ్చేశాడు. బంగాళా వెనుక కాంపౌండులో ఆరుగదులు వరుసగా కట్టబడి ఉన్నాయి. ఆ గదుల్లో రెడ్డి ఆఫీసులో పనిచేసే ఉద్యోగులు మరికొందరు కాపురమున్నారు. తనకు కేటాయించిన గది చూపించారు.

గదిలో ఒక నులకమంచం, దానిమీద చిన్న పరుపు...గూటిలో పుస్తకాల దొంతరులు, ఒక ట్రంకు పెట్టె...సబ్బుపెట్టె అద్దం...దువ్వెన కనిపించాయి. ఆ గదిలో యింకొకరుకూడా ఉంటున్నారనే సంగతి బుజావయింది. కాలకృత్యాలు తీర్చుకోడానికి బయటికి వెళ్ళిన నానాస్వామి గదిలోకివచ్చి శివరాంవైపు చోద్యంగా చూసి నవ్వాడు.

"మీరేనా క్రొత్తగావచ్చిన టైపిస్టు... రండి...రెడ్డిగారు చెప్పారు... మనిద్దరం ఇందులో ఉండాలి...ఎలా ఉంది మనగది!"

నటకుడులా చేతులు చాచి గదిచూపిస్తూ హోయలుగా నడిచాడు. కనుబొమలు ఎగరేస్తూ. ఒంటరిగా బ్రతికేమనిషి మరొకడు తనకు తోడుగా ఉన్నాడని సంతోషించాడు శివరాం.

ఆరోజు ఆఫీసుపని మొదలుపెట్టాడు శివరాం. పని చాలా ఎక్కువగానే ఉంది. తన దగ్గరవున్న కొద్దిసొమ్ము సెలాఖరులోగా పరిపుచ్చుకుంటే, జీతంవచ్చేక అవసరమైన బట్టలు, పెట్టె మొదలైనవి కొనుక్కోవచ్చు

# ★ అన్వేషణ ★

ని ఒక ప్రణాళిక వేసుకున్నాడు శివరాం.

వినాయక రెడ్డి శివరాంపని మానేసి సంతృప్తి పడ్డాడు. ఆయిదుగంటలు కాగానే శివరాం దగ్గరకు వచ్చాడు.

"ఆఫీసు మూసేసే వేళ అయింది...మీరు వెళ్ళండి...నగరం అంతా చూశారా?...మీ వసతి సౌకర్యంగా ఉందా?...ఏమున్నా కావాలంటే మా యింట్లో నిర్మొహమాటంగా అడిగి తీసుకోండి!" ఖులాసాగా నవ్వుతూ రెడ్డి వెళ్ళిపోయాడు.

రెడ్డి మంచితనం శివరామ్‌కు ఆనందం కలిగించింది. సహృదయుడైన యజమాని మొదట తనకు తారసిల్లడం తన భావికి సుఖ సూచక మనుకున్నాడు.

నానాస్వామితో కలిసి శివరాం సాయంత్రం బాహ్యాళి వెళ్ళాడు. నారాయణగూడా కౌరస్తాలోని హోటల్లో భోంచేసి రెడ్డిగారి బంగళా చేరుకున్నాడు శివరాం. దారిలో నానాస్వామి అనేక సంగతులు చెప్పాడు. ఢిల్లీ నుంచి వచ్చి యిక్కడ గుమాస్తాగా చేరడం, జీతం చాలక పెళ్ళి చేసుకోకుండా ఉండడం...రెడ్డి మన స్తత్వం...ధూసివ వినిమాలు...రెడ్డి కూతుళ్ళు, కొడుకులు ఆఫీసు ఉద్యోగులపై చేసే అధికారం.. తమగదుల ప్రక్కనే కాపురముంటున్న ఇతర ఉద్యోగుల కుటుంబవిషయాలు...రసవత్తరమైన కథల్లా వినిపించాడు శివరాంకు. తరచి చూచిన కొద్దీ మనుష్యుల జీవితాల్లో ఎన్నో నిగూఢరహస్యాలు ఉంటాయి కాబోలు అనుకున్నాడు శివరాం.

గదిలోని విద్యుద్దీపం ఆర్పి, దుప్పటి ముసుగుపెట్టుకుని నిశ్చింతగా మంచంమీద పరిగాడు నానాస్వామి. శివరాం తన పరుపు చుట్టకూడా పరచుకున్నాడు. దోమలు కూని రాగాలు పాడుతూ గదిలో ఎగురుతున్నాయి. గది బయటికి కిటికీలోంచి చూసేడు. రెడ్డి బంగళా వెనుక భాగం కనిపించింది అక్కడ రెండు గుడిసెలు, కాళీస్థలం కనిపించాయి. ఆ బంగళాను వేరుచేసే గోడపై ఆగుడిసెల్లోని పేదవాళ్ళు పిడకలు చరిచారు. వీధిలోని బాటసారులు విడిచే అపరిశుద్ధం. గోడకు ప్రక్కగా దొలుముకు ప్రవహిస్తున్న చిన్న మురికి కాల్వ దుర్వాసనలువెదజల్లుతున్నాయి. నిద్రపట్టక శివరాం బంగళా లోపలి ఆవరణలోకి వచ్చాడు.

ప్రక్కగదుల్లోని కుటుంబాల ఆడంగులు కాళ్ళు బారుకు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. రెడ్డి నివసించే మేడకు తను గదులకు మధ్యనున్న అరఫర్లాంగు దూరం పూలకుండీలతో మొక్కలతో, ఫలవృక్షాలతో, పూరపాదులతో, సుందరంగా నిర్మిత పద్ధతిలో ఆ తోట పెరిగి ఉంది. చూరుని దూసుకుని వెన్నెల గర్భండాలోకి వస్తున్నది. పండు వెన్నెలహాయిలో బంగళా కాంపౌండులోని చూతవృక్షం పరవశించిందుతూ నృత్యం చేస్తోంది. రెడ్డిగారి బంగళా కిటికీఅద్దాలు, లోపల విద్యుద్దీపాల కాంతితో తెల్లగా మెరుస్తున్నాయి. మేడమీద మసలుతున్న జనం నీడలు ద్వారబంధాలకు కట్టిన అందమైన తెల్లగింజ తెరలపై అగుపించి, చెదరి పోతున్నాయి. మేడమీద కిటికీలోంచి రెడ్డిగారి భోచ్చుకుక్క నాలుక బాపి తయాసంగా ఒగరుస్తూ తమాషాగా చుట్టూ ఉన్న దృశ్యాలు తిలకిస్తోంది. జీవితాల్లోని అంతస్తుల విభేదాలు శివరాంకళ్ళ ముందు కట్టాయి. ఎప్పటికైనా అటువంటి బంగళాలో రెడ్డిగారిలా తను జీవించగలడా? జనించిన స్థాయిని దాటి బ్రతుకులో అంతస్తుల సోపానాలు ఎక్కడం. నిరంతరం సోపానాలకు జారుడు రంపపూసి దిగజార్చే సంఘం కట్టుబాటు నెదుర్కొని నెగ్గడం...సాధారణవిషయం కాదనిపించింది. నిద్ర రాకపోయినా ప్రక్కనున్న కుటుంబాలకు ఒంటరిగా [illegible] నిలుచుని, దురభిప్రాయం కలిగించకూడదనుకుని శివరాం తన గదిలోకి పోయాడు.

క్రొత్తస్థలం...దోమల రోదన... దుర్వాసనలు...పరిమితమైన చిన్న గది ... శివరాం నిద్రను చెడగొట్టాయి. ఉదయం కాగానే లేచి రాత్రి దోమలు శరీరాన్ని పీల్చి విడిచిన దద్దురులు తడుముకుంటూ నిర్లక్ష్యంగా కాలకృత్యాలు తీర్చుకుందామని వరండాలోకి వచ్చాడు వినాయక రెడ్డి పంచెనడుంకు గూడకట్టు కట్టబుజంమీద తువ్వాలు సరిచేసుకుంటూ నోట్లో పెద్ద చుట్టతో రైలు ఇంజనులా పొగలు వదులుతూ, చేతిలో ఏవో కాగితాలు పుచ్చుకుని శివరాం దగ్గరకు వచ్చాడు.

'లేచావుటోయ్...నీకోసమే వచ్చా... ఈ కాగితం చాలా జరూరుగా కావాలి... ఒక్క గంటలో టైపు చెయ్యాలి...' కాగితం రెడ్డి అందిచ్చాడు.

'ఇంకా ముఖం...' నూనె కారే జిడ్డు ముఖాన్ని తువ్వాలుతో తుడుచుకుంటూ నసిగాడు శివరాం.

'ఆ......అయితే నేను ఆఫీసు గదిలో ఉంటా...ఒక్క అయిదు నిమిషాల్లో... వచ్చేయి!' నవ్వుతూ వెళ్ళిపోయాడు రెడ్డి.

నిద్రనుంచి లేచీ లేవకుండా, రెడ్డి ఇచ్చే ఆఫీసుపని తల్చుకుని చికాకుపడ్డాడు శివరాం అయినా ఒక్క రోజు యిటువంటి పని చేస్తే తప్పు లేదనుకుని సమాధానపరుచుకున్నాడు.

కాఫీ కూడా త్రాగకుండా మేడ ఆఫీసులోకి వెళ్ళి టైపురైటరువద్ద కూర్చున్నాడు శివరాం. రెడ్డి కాగితాలు నౌకరుద్వారా పంపించాడు. అవి పూర్తి చెయ్యకుండానే విరామం లేకుండా యింకా కాగితాలు రెడ్డి పంపించసాగాడు యజమాని ప్రవర్తన విడ్డూరమనిపించింది శివరాంకు. ఒక గంట గడిచేక యజమానితో చెప్పి భోజనానికి వెళ్ళిపోయాడు శివరాం. శివరాం టైపు చెయ్యవలసిన కాగితాలు అలాగే వుంచి వెళ్ళిపోవడం రెడ్డికి అసంతృప్తి కలిగించింది. అయినా ఏమీ అనలేక వూరుకున్నాడు.

ఆఫీసుకు వచ్చాక సాయంత్రందాకా ఎడతెరిపి లేకుండా పని వచ్చింది శివరాంకు. మధ్యాహ్నం నానాస్వామి యిప్పించిన ఒక కప్పు కాఫీ త్రాగి పనిలో నిమగ్నమయ్యాడు. తోటి గుమాస్తాలు శివరాంవైపు చిత్రంగా చూడసాగారు. మనుష్యుల్ని అర్థం చేసుకోడానికి అవకాశం కావాలనుకుని మౌనంగా కూరుకున్నాడు శివరాం.

ఆరుగంటలు దాటేక రెడ్డి శివరాందగ్గరకు వచ్చాడు.

"సాయంత్రం బయటికి అనవసరంగా వెళ్ళకు...ఏమున్నా జరూరుగా టైపుచేసే కాగితాలు రావచ్చు...మన యింట్లో పేక, కేరమ్సు..వార్తాపత్రికలు, అన్నీ ఉన్నాయి. ఆటలో దానికి మా అమ్మాయిలున్నారు...

"నేను అందరం...హిహిహి...కలిసి ఇక్కడ ఆడుకోవచ్చు" రెడ్డి ఆనందంగా నవ్వుతూ చుట్టపొగలు గుప్పు మనిపించుకుంటూ వెళ్ళిపోయాడు.

బంగళా వెనుకనే తన సమకూర్చిన రెడ్డిగారి మన స్తత్వం శివరాంకు అర్థమయింది. ఒక్క ఉద్యోగమే తన జీవితలక్ష్యం కాకుండా యింకా ఎన్నో పనులు చేసుకోవాలనుకున్న శివరాంకు యీ వాతావరణం నచ్చలేదు. నిర్బంధంగా నియమితమైన గంటల్లోనే ఆఫీసు పని చెయ్యడం తప్ప యితర సమయాలు జ్ఞానాభివృద్ధికి, స్నేహితులను పెంచుకోడానికి, వినియోగించుకోవాలనుకున్నాడు శివరాం.

రెడ్డిమాటలు లెక్క చెయ్యకుండా శివరాం నగరంలోకి వెళ్లిపోయాడు సాయంత్రము పికారుకు. తిరిగి తిరిగి రాత్రి పది గంటలకు ఇంటికి వచ్చాడు. బంగళా వీధి గేటు తాళం వేయబడివుంది. గట్టిగా నౌకర్లను పిలిచాడు శివరాం. మేడగదిలో మనుష్యుల సంచలనం నీడల కదలికల్లో కనిపిస్తున్నా ఎవరు బంగళా గేటు తియ్యలేదు. గోడ దూకి లోపలికి ప్రవేశించాడు. రెడ్డిగారి బొచ్చుకుక్క మేడమీద నుంచి అరుస్తోంది కాంపౌండులోని గేదె బలంగా మేసి త్రేన్చింది. కాంపౌండులోని ఉసిరిచెట్టు ఒళ్లు విరుచుకుని గాలికి తూగుతోంది. గబగబ అడుగులు వేసుకుంటూ బంగళా ముందు తోట ముందరికి వచ్చాడు శివరాం. కారు షెడ్డు ప్రక్కగది రేకు తలుపు విచ్చుకుంది. ఎవరో వనిత ముందుకు రాబోయి శివరాంను గమనించి గబుక్కున ఎలుకపిల్లలా లోపలికి వెనుదిరిగింది. కంగారులో మూసిన రేకుల తలుపుల్లోంచి ఖరీదైన గులాబి సిల్కుచీర బయటికి వేలాడింది. మధ్యాహ్నం స్నేహితురాలికి ఒక ఉత్తరము టైపు చెయ్యమని వచ్చిన రెడ్డిగారి పెద్దకూతురు ప్రమీల ఆ ఎర్రగులాబి చీర కట్టుకుంది. కారు షెడ్డు ప్రక్క గదిలో డ్రైవరు ఒంటరిగా కాపురముంటున్నాడు. పరిస్థితి పరిశోధించాలనుకున్నాడు శివరాం. గబగబ నడిచి చూతవృక్షం చాటున ఒదిగి నిలుచున్నాడు. ప్రమీల కంగారుగా తల వంచుకుని తోట దాటి వెళ్లిపోయింది. హుషారుగా ఈల వేసుకుంటూ శివరాం మెల్లిగా అడుగులు వేసుకుని తన గది చేరాడు. నాగాస్వామి చదువుతున్నాడు ఏదో పుస్తకం.

'ఎవరికీ చెప్పకుండా ఎగిరిపోయామేటోయి?' నాగాస్వామి సాయంత్రం శివరాం కనిపించలేదని అడిగాడు.

'ఎన్నో విషయాలు నిన్న రాత్రి చెప్పావు ...ఈ సంగతి చెప్పలేదే.' శివరాం హుషారుగా దుస్తులు విప్పుకున్నాడు.

'ఏ విషయం?'

'రెడ్డిగారి కూతురు ప్రణయగాథ!'

"ప్రణయమనేది నువ్వూ నేను చెయ్యలేం. కామించి మోసం చెయ్యగల కఠినహృదయం...సంఘ నియమాలు ఛేదించగల సాహసం...కాలం తెలివి వృథా చెయ్యగలిగే పట్టుదల...అలవర్చుకో గలిగితేనే ఈ నాగరిక ప్రపంచంలో ఇటువంటి గాథల్లో నాయకులు కావచ్చు. ఆ లక్షణాలు నీలోనూ లేవు...నాలో లేవని ఏనాడో నిర్ణయించుకున్నా...అందుకే యీ విషయం తెలిసినా పూర్తిగా మర్చిపోయాను!" నాగాస్వామి శివరాం భుజంమీద గట్టిగా తట్టి అసలు సంగతేమిటి అని ఆత్రుతగా అడిగాడు. నాగాస్వామి విషయం తెల్సుకుని పకపక నవ్వాడు. శివరాం అతని నవ్వులో శ్రుతికల్పాడు. ఆ నవ్వుల శ్రుతిలో గదిలోని విద్యుద్దీపం ఆరిపోయింది. రెడ్డిగారి బంగళాలో అంతా నిశ్శబ్దం తాండవించింది.

మర్నాడు ప్రొద్దున ప్రక్కమీద బద్ధకంగా దొర్లుతున్నాడు శివరాం. గది తలుపు చప్పుడయింది. లేచివెళ్ళి తీశాడు తలుపు. ఎదురుగా డ్రైవరు కనిపించాడు రెడ్డిగారు రమ్మంటున్నారని.

"అదృష్టవంతుడివి! ప్రొద్దున్నే లేవగలిగేవు!" శివరాం డ్రైవరువైపు భావగర్భితంగా నవ్వి "వస్తున్నానని చెప్పు!" అన్నాడు.

రెడ్డి బంగళాలోని తోటప్రక్కగా పేముకుర్చీలో కూర్చుని, క్రితంరోజు వార్తాపత్రిక తిరగవేస్తున్నాడు. శివరాంను చూడగానే ఆప్యాయంగా పిలిచాడు.

"కాఫీ తెప్పించనా!"

మౌనంగా నవ్వి ఊరుకున్నాడు, శివరాం. మరుక్షణంలో టేబిలుమీదకు కాఫీ వచ్చింది. నిర్మొహమాటంగా త్రాగేశాడు శివరాం

"ఒక ముఖ్యమైన ఉత్తరం టైపు చెయ్యాలోయి...వ్రాసుకో!"

చేతిలో కాగితం కలం లేకపోయినా వ్రాసుకోమని మామూలుహోదాలో యజమాని మాట్లాడడం విచిత్రమనిపించింది. ఇంతలోకే రెడ్డి తన కూతురును పిలిచాడు కాగితం కలంతో ప్రమీలా వచ్చింది. తండ్రి ప్రక్కగా మరో కుర్చీలో గర్వంగా కూర్చుని, కాగితంకలం టేబిలుమీద పెట్టింది శివరాంవైపు హుందాగా చూస్తూ. వలిగిన ఎర్ర సిల్కు చీర...ముఖంమీద మొలిచిన మొటిమలు...రెండు జడలు...జీరలు కడుతున్న. నల్లటికళ్ళు...సన్నటి ఆకారం...పలుచని ముఖం...రేగిన శిరోజాలు...నాగరికమైన ప్రౌఢత్వం ఆమెలో ప్రతిఫలించాయి

ఉత్తరం సారాంశం చెప్పాడు రెడ్డి... అది ప్రమీల పెళ్ళిగురించిన విషయం... కాబోయే ఆమె మామగారితో సంప్రదింపులు...మధ్య మధ్య ప్రమీల అడ్డుకుని మాటలు మార్పించింది. ఐ. ఏ. యస్. పరీక్షకు వెళ్ళిన కొడుకుని పిల్లని చూడ్డానికి యింకా పంపలేదేమని...ప్రశ్న!...గృహవిషయాలు ఉత్తరాలు కూడా ఆఫీసు టైపిస్టుచేత టైపు చేయించుకోడం యజమానుల అధికారగర్వమే ననుకున్నాడు. శివరాం. "ఈ ఉత్తరాలసంగతి ఎవరికీ చెప్పకూడదు... తెలుసా!" యజమానిగా అధికారంగా ఆజ్ఞాపించాడు రెడ్డి.

కాగితాలు తీసుకుని ఆఫీసుగదిలోకి వెళ్లాడు. రెడ్డియిచ్చిన ఉత్తరం టైపుచెయ్యడానికి మనస్సు అంగీకరించలేదు. స్వతంత్ర బుద్ధి పెరుగుతున్న శివరాంలో విప్లవాత్మకమైన సంచలనం కలిగింది. అధికారులకు ఒక్క ఆఫీసుపని తప్ప తదితర స్వంతపనులు చేయకూడదన్న సిద్ధాంతాన్ని పాటించాలని నిశ్చయించుకున్నాడు. ఆ కాగితాలు టైపురైటరు దగ్గర విడిచేసి తనగదిలోకి వెళ్ళిపోయేడు.

భోజనం చేసి అందరి ఉద్యోగులతోపాటు ఆఫీసుకు వచ్చాడు శివరాం. రాగానే రెడ్డి పిలిపించాడు. ఉత్తరం టైపు అయిందా అని అడిగాడు. అటువంటి ఉత్తరాలు టైపు చెయ్యనని నిష్కర్షగా చెప్పేశాడు శివరాం. రెడ్డి ఆశ్చర్యపోయాడు. ప్రొద్దున అతనికిచ్చిన కాఫీ వృథాఅయిపోయి, ఎదురు తిరిగి అతనిలో చైతన్యం కలిగించిందని వాపోయాడు.

టేబిలుమీద మరో రెండు పెళ్ళిఉత్తరాలు కనిపించాయి. ఆఫీసులో పెద్దగుమాస్తా వచ్చి శివరాంను గదిమాడు ఆ ఉత్తరాలు టైపు చెయ్యమని. అతనివైపుచూసి వ్యంగ్యంగా నవ్వాడు శివరాం రెడ్డిగారి పెద్దకొడుకు భుజంగరెడ్డి గబగబ వచ్చాడు కోపంగా తండ్రి ద్వారా సంగతి తెల్సుకుని, అతనికీ అదే సమాధానం దొరికింది. శివరాం మాటల్లో సత్యం ఉన్న సంగతి గమనించినా, తండ్రికి బామర్దా కలగకూడదని భుజంగరెడ్డి శివరాం పై గట్టిగా అరిచాడు, తక్షణం ఆ ఉత్తరాలు టైపు చెయ్యమని.

(ఇంకా వుంది)

# నక్షత్ర ఫలితాలు

[ 15-7-59 మొదలు 21-7-59 వరకు ]

బి. నరసింగరావు

### గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| కే | | | ర |
| | తే 16 దీని కర్కాటకములో ప్రవేశించును. తుల, వృశ్చిక, ధనుర్మకరములలో చంద్రుడు. | | బు |
| | | | కు శు |
| శ | గు | | రా |

### * అశ్విని [ చూ, చే, చో, లా ] *

ఈ వారము వినోదములలో పాల్గొనుట. దధిక్షీర మధుర పదార్థయుక్త భోజనము రజితపాత్రలలో భుజించుట. తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము తెల్లనివస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగుతవి. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవ పదార్థముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. వారాంతమున అధిక ఆందోళన.



### * భరణి [ లీ, లూ, లే, లో ] *

ఈ వారము ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి, కృషిమూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు బాగా చదువుకుంటారు. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. స్త్రీలతోనూ, ఆప్తులతోనూ విందు, వినోదము 21 న కుటుంబ కలహము.

### * కృత్తిక [ అ, ఈ, ఉ, ఏ ]

ఈ వారము మీకు రాబడి తక్కువ. కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరకకలతలు. ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహారాధన రవికి శాంతి చేయించడము మేలు. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు. వర్తకులకు ఆందోళన. 15, 16 పితృవర్గ సహాయము. కార్యలాభము. ప్రయాణము. 18 న రాజకీయ వాదులకు ఆందోళన, అధిక ఖర్చులు 21 అనారోగ్యము.

### * రోహిణి [ ఓ, వా, వీ, వూ ] *

ఈ వారము మీకు మొదట్లో నిరాశగా వున్నా, మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు బదిలీ అయ్యే సూచనలు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములువున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తుసంపాదన వంటి శుభయోగములు కూడా వుంటాయి.

### * మృగశిర [ వే, వో, కా, కి ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము, కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. మీ బుద్ధిబలము ఉపయోగించి ప్రయత్నించినా కార్యసిద్ధి వుండదు. చేతికి వచ్చేడబ్బు అవసరాలకు సరిపోక ఇబ్బందిచే అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగా వుందని తెలిసి మదన పడతారు. అయినను దైవానుగ్రహముచే అన్నీ సరిపడగా తాయనే మనోధైర్యముతో వుంటారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన నిలకడ లేని స్థితి, ప్రయాణము. 16, 17 వస్త్రదిక్కు లాభము. పుణ్యక్షేత్ర సంచారము, దేవతా దర్శనము. వింతలను చూచుట. 18 న ఆరోగ్యచింత.

### * ఆరుద్ర [ కూ, ఖ, జ, ఛ * ]

ఈ వారము అనుకున్నట్లుగా డబ్బు చేతికి రాకపోవుటచేతను, అధిక ఖర్చులు చేతను అశాంతి కలుగుతుంది. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి ఉద్యోగస్తులకు అధికారుల తొందరలు. వర్తకులకు అశాంతి భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహారములపరిష్కారములో దుష్టస్త్రీతో వివాదము. 16, 17 ధనలాభము. 18 వ కార్యభారము, త్రిప్పట, వివాదములు భార్యకు ఆరోగ్యభంగము. 19, 20 న కార్యసిద్ధి.

### * పునర్వసు [ కే, కో, హా, హీ ] *

తలపెట్టిన పనులుమీద వేసుకొని కార్యసాధన అవనప్పటికీ నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు ఫలప్రాప్తి పొందుతారు. సోదర సహాయము కొంత అనుకూలత కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల చురుకుమాటలచే మనోవ్యధ కలుగుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి. ప్రమాదమువల్ల గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు, ఎరువుల వ్యాపారస్తులకు గనుల యజమానులకు లాభము. 21 ప్రమాద సూచన 18 కార్యభారము, ఆటంకములు 19 సోదరసహాయము, కార్యలాభము.

### * పుష్యమి [ హూ, హే, హో, డా ] *

ఈ వారము మీకు యోగదాయకము బంధుసహాయము, అధికారుల సహాయము కలుగుటచేతను, ఆటంకములను గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులు ఉత్సాహముగా కొత్తక్లాసులలో చేరుతారు. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలు కాలము.

### * ఆశ్రేష [ డీ, డూ, డే, డో ] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు

## ఈ వారము ధరలు:

నూలు, వస్త్రములు:- మార్పు లేదు.
నూనెదినుసులు:- నిలకడగా వుండును.
ఆహారధాన్యములు:- మార్పు లేదు.
బెల్లము, పంచదార, చింతపండు:- సమస్థాయిలో వుండును.
పప్పుదినుసులు :- మందముగా వుండును.
వెండి, బంగారము:- స్వల్ప తేడాలో వుండును.
సామాన్యముగా వర్షించును. మేఘాచ్ఛాదితమై వుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, విష్ణువను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

పొందుతారు పిల్లల బాగు కొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన వుద్యోగస్తులకు న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగం వుంటుంది. సంగీత సభలు కవితా గోష్ఠి వంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభ కార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా ఉంటుంది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈ వారము యోగదాయకముగా ఉంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభ, పుణ్య కార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయ, విక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగముతో కూడియున్నా కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. వారాంతమున కుటుంబములో మిత్రులతో విందు, వినోదము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారం రాబడి తక్కువ. కార్యభారం ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్థలు వస్తవి. అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడము, రవికి శాంతిచేయడము మంచిది. వుద్యోగస్తులకు క్రొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడి ఉన్నా పితృవర్గమునుండి సహాయము, కార్యలాభము కలుగతవి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మొదట్లో నిరాశగా ఉన్నా మిత్రసహాయమువల్ల ఆందోళన తీరుతుంది. ఇంట్లో ఉన్న వారి అనారోగ్యమువల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమున లాభము. వారమంతా వుద్రేకముతో ఉంటుంది. విదేశీయుల పరిచయము. అపురూపవస్తు సంపాదనలు కలుగుతవి. 18 అధిక ఖర్చులు, 21 మనోవ్యథ.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక, ఆందోళన కలుగుతుంది. అయినప్పటికి దైవానుగ్రహమువల్ల కష్టములు గడచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువలన మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగా ఉన్నా వస్త్రద్రవ్య లాభము పొందుతారు. 18న అధిక ఖర్చులు.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదములు వచ్చి మనోవ్యధ కలుగుతుంది కోర్టువ్యవహారములు అనుకూలించినా అమిత ఖర్చుల వల్ల అసంతోషముంటుంది. భార్యకు అనారోగ్యం కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతరజాతుల వల్ల గౌరవము కలుగుతుంది. 18 న బంధువుల రాక, అధిక ఖర్చులు.

### * విశాఖ [తి, తూ, తే, తో] *

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యాలకు ఆటంకము కలుగుతూనే వుంటుంది. అయినప్పటికి పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదములు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు, భూస్వాములకు కష్టముతో కూడిన లాభము. పోలీసుశాఖ ఉద్యోగస్తులకు మేలు కాలము. 21 న ప్రయాణ సూచన.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము మీకు యోగదాయకము ప్రయత్నించినపనులు నెరవేరుతవి. లాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కు నుండి క్షేమ సమాచారము తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము గణితజ్యోతిష శాస్త్రదర్శులు జరుగుతాయి. ప్రత్తి, దూది, నూలు బట్టలు ఇత్తడి, కంచువర్తకులకు లాభదాయకము. కవులకు శిల్పులకు, నటీనటులకు మేలు కాలము. 18 న అధిక ఖర్చులు.

### * జ్యేష్ఠ [నో, యా, యి, యూ,] *

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికివస్తుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ ప్రభుత్వసన్మానము వైద్యజ్యోతిష శాస్త్రములవంటి ప్రసంగాలు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగులకు పండితులకు ఉపాధ్యాయులకు మేలుగా ఉన్నా కొంత ఆందోళనకూడా ఉంటుంది. పిల్లల అభివృద్ధికి కొన్ని ఏర్పాట్లు చేస్తారు.

 

# నక్షత్రఫలితాలు



*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము మీరు తలపెట్టిన కార్యములలో జయముపొందుతారు. వెండిపాత్రలలో మృష్టాన్న భోజనము బంధుమిత్రులతో చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము ద్రవపదార్థ జనిత వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు,నటీనటులకు మేలుకాలము 18 న అధిక ఖర్చులు.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]***

ఈ వారము మీకు యోగప్రదము. ధన, ధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాదిశుభ కార్యాలలో పాల్గొంటారు ఇష్టవస్తు లాభము; పరోపకారం వల్ల కీర్తి కలుగుతుంది. విద్యార్థులకు చాలా చురుకుగా చదువు సాగుతుంది. ఖరీదయిన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు అమిత లాభము పొందుతారు. వాహనయోగములు కలుగును. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 18 న కుటుంబకలహము.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింత మాటలు వినుట పరాక్రమమువల్ల ఘనత ప్రయాణము, ధనలాభము ఉండును. అకాల భోజనమువల్ల అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు సరిగా చదువుసాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితో పాటు అనుకూలత. 21 అనారోగ్యము.

*** శ్రవణము [జూ, జే, జో, ఖా] ***

ఈ వారము తలపెట్టిన పనులు నెరవేరవు. ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము తక్కువ, ఆత్మీయుల ఆరోగ్యం చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతములకుబదిలీ అయే సూచన లున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించబడుతారు. వారమంతా చికాకుగా నున్నా వారాంతమున మిత్ర సహాయము, విదేశీయుల పరిచయము, కార్యసిద్ధి జరుగును.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకుంటారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినను దైవబలంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లో వారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి,వర్తకులకు నిరాశ,విద్యార్థులకు మంచి రోజులు కావు వారమంతా ఆందోళనగా నున్నాను సజ్జన సాంగత్యము పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, వింతలను చూచుట, నష్టద్రవ్య లాభము కలుగుతవి.

***శతభిషం [గో, సా, సి, సూ]***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తవి. కోర్టుదావాలు అనుకూలిస్తవి పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా యుండదు. ఇచ్చిపుచ్చుకోవటంవల్ల వివాదములు ఉద్యోగస్తులకు అధికారులఒత్తిడి ఉన్నా తోటి వారిసహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున మేలు. విద్యార్థులకు చదువు బాగాసాగదు.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారముఎన్ని ఆటంకములువచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభం పొందుతారు. ఆశించిన ధనం సమయానికి అందక అప్పుచేస్తారు ఆత్మీయులవల్ల నిందలపాలవుతారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగస్తులకు రంగులు లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతోకూడిన లాభము. 21 న ప్రమాదభయం.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోను, అధికారుల సహాయముతోను ఫలము పొందుతారు. ఆదాయము వృద్ధిఅగుతుంది. వైద్యజ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కు నుండి క్షేమము తెలుస్తుంది. విద్యార్థులకు మంచి కాలము. కవులకు, శిల్పులకు, గణితశాస్త్రజ్ఞులకు, నటీనటులకు యోగకాలము, 16, 17 తేదీలలో ధనలాభము. కార్యసిద్ధి.

*** రేవతి [దే, దో, చా, చి] ***

ఈ వారము మీకు యోగదాయకముగా ఉంటుంది. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత ఉంటుంది. పండిత గోష్ఠి జరిపి విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగము లున్నా కొంత ఆందోళనగాఉంటుంది. ధనలాభము, పుత్రుల అభివృద్ధి కార్యసిద్ధి, 21 న అధిక ఖర్చులు విద్యార్థులకు చదువుబాగా సాగుతుంది. న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగులకు పండితులకు ఉపాధ్యాయులకు మేలు

# ఆరుద్ర గళ్లనుడికట్టు 9

## ఆధారాలు

**అడ్డం**

1. రెండింతలూ మూడింతలూ కాదు కొత్త పాత్రమే.
3. ఈ నుడికట్టు రచయిత ఎవరంటే నా జవాబు.
4. దీని ముందుది.
7. అమర్యాదగా అతని వదను.
8. కయి కదే కమి కటి?
11. పదకొండు నిలువుయొక్క ఏకవచనం కబళం.
12. అవును! ఇది యుక్తము.
13. కుంటికి పాత్రలు పడినప్పుడు సంభవించవచ్చు.
16. ఏనుగు కొలత ఇంతేనా?
17. ఎందుకూ? రవంతలో వెడికి వందుకుంటే సరి.
21. గోడమీద బొమ్మ గొలుసు గొలుసులబొమ్మ...
22. ఈ సంఖ్య స్వభావం? కరెక్టు!
23. అడ్డదిడ్డంగా తరుము తున్నప్పుడు జనించే శబ్దం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | ■ | 4 | 5 |
| | ■ | | ■ | | ■ | 6 | ■ | |
| | ■ | 7 | | ■ | 8 | | | ■ |
| ■ | ■ | | ■ | 9 | ■ | | ■ | 10 |
| 11 | | ■ | 12 | | | ■ | 13 | |
| | ■ | 14 | ■ | | ■ | 15 | ■ | ■ |
| ■ | 16 | | | ■ | 17 | | ■ | 18 |
| 19 | ■ | | ■ | 20 | ■ | | ■ | |
| 21 | | ■ | 22 | | ■ | 23 | | |

**నిలువు**

1. ఇదే.
2. పరులు కారు. తరువాత కుంచానికి చేసేది కలిపితే బంధువులు.
3. ఇవాళ చేరడు కొమ్ములా పెరుగ్గా ఉంచి ప్రమాను కొట్టేయుండి.
5. రాలిపోవు. మారేడువిల్లులో మార్పు పొందేవి రాలిపోగా.
6. ఈ సంవత్సరం వ్యంత సూర్యునిదా?
9. చూడమనే పండుగ.
10. ఈ పక్షి కథచిన్నది.
11. పదకొండు అడ్డంయొక్క బహువచనం నేత్రాలు.
14. మునిజనులందు కొండట నిలకడమీద తేలేది.
15. రెండు నిలువు కానివాడు.
18. ఇష్టమైనది చాక కాదు.
19. రెండులో ఒకటి తీసివేస్తే ఎంతో చమత్కరించే జవాబు.
20. పేనితే ఎక్కు పట్నం.

★

### 8-వ నుడికట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 కో | తి | మూ | 2 క | ■ | 3 ప | వ | 4 న | ము |
| ■ | ■ | ■ | 5 లి | పి | ని | ■ | ర | ■ |
| 6 జో | గి | జో | గి | ■ | ■ | 7 రి | వా | 8 జు |
| ల | ■ | ■ | న | ■ | 9 అ | ■ | స | త్తు |
| ■ | 11 పి | తృ | వా | క్య | పా | ల | న | ■ |
| 12 మ | చ్చ | ■ | రు | ■ | ర | ■ | ■ | 13 గ |
| 14 ర | 15 క | ము | ■ | ■ | 16 మై | లు | రా | ళ్ళు |
| ■ | పి | ■ | 17 ర | చ | న | ■ | ■ | ■ |
| 18 గో | ల్ల | భా | మ | ■ | 19 దీ | క్షి | బొ | మ్మ |

## ★ నెమళ్ళ రాజు ★

(31 వ పేజీ తరువాయి)

వచ్చా"రని అడిగాడు.

"నెమళ్ల రాజు కోసం బయలు దేరాం..." అని సందేహిస్తూ చెప్పాడు అజయుడు.

"ఓహో" అన్నాడు సీతాకోక చిలకలరాజు.

"నవ్వారేం?" అన్నాడు విజయుడు.

"ఎందుకూ నవ్వటం?" అని అడిగాడు రాజు.

"మే మింతవరకూ ఎవరన్నడిగినా పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వేవారు. మా మాటలు వేళాకోళంగా కట్టే శారు," అన్నాడు అజయుడు.

"పిచ్చివాళ్లు!" అన్నాడా రాజు.

"అయితే నిజంగా నెమళ్లరాజు ఉన్నాడా?" అని అజయ విజయు లిద్దరూ ఒకేసారి అడిగారు.

"ఓ. ఉన్నాడు. నెమళ్ల రాజ్యంలో ఉన్నాడు."

"నెమళ్ల రాజ్యం అనేదొక టుందా?" అన్నా రన్నాదమ్ములు.

"మీరూ పిచ్చివాళ్లే; సీతాకోక చిలకల రాజ్యమే ఉండగా నెమళ్ల రాజ్యం ఎందుకుండదు? అయితే ఇక్కడికి చాలా దూరం," అని సీతాకోక చిలకల రాజు నెమళ్ల రాజ్యానికి ఎలావెళ్లాలో వివరంగా చెప్పాడు.

ఆ రాజుదగ్గిర సెలవు తీసుకుని మళ్లీ బయలుదేలారు. దారి బాగా గుర్తుపెట్టకుని ప్రయాణం చేయటం చేత తెల్గిగా, తొందరగా నెమళ్ల రాజ్యం చేరుకున్నారు. ★

(మిగతాకథ పైవారం)



# రేపటి వార్తలు

మనలో చాలమంది గాఢనిద్రలో వుంటాం. కాని ఆ నిశిరాత్రివేళ తంతిప్రసారం జరుగుతూనే వుంటుంది. ఆ నిశిధ సమయంలోనే పత్రికా కార్యాలయాల్లో మరునాటి పత్రికా ప్రచురణ కరవేగంతో జరుగుతూవుంటుంది.

ఉదయమే మీరు వార్తాపత్రిక తెరిచేసరికి రాజకీయ చదరంగంలోని ప్రచ్ఛన్న యుద్ధవార్తలో, శిఖరాగ్ర సమావేశ వార్తలో. ప్రమాదవార్తలో శోక విషాద మరణవార్తలో ప్రముఖ శీర్షికలతో కన్పిస్తాయి.

ఒక్కక్షణం ఆగి ఆలోచించండి— యీ ప్రమాదాలకు గురైనవారి కుటుంబాల పరిస్థితి.

ఈ విషాదవార్తలే జీవితంలో మనకు పాఠాన్ని నేర్పుతాయి. మీరు ప్రేమానురాగాలతో చూచుకొనే మీ భార్యాబిడ్డల భవిష్యత్తు ఏమి కానున్నదో ఒక్కసారి ఆలోచించండి— మీ దృష్టిపథంలో గోచరించేది జీవితబీమా ఒక్కటే. కాని జీవితంలో విషమసమయాల్లో కూడా దుఃఖంచింతలేకుండా గడపడానికి సహాయపడేది జీవితబీమా ఒక్కటే.
మీకు తగిన బీమా పథకాన్ని చూపుటకు జీవితబీమా ఏజెంటు నడగండి.



## జీవిత బీమా

—మీరు బీమా చేసిననాడే మీకు రక్షణ కలుగుతుంది.

EP/LIC/SZ/2



# వనితా లోకం





## అనుమానాలు

అనుమానం పెనుభూతమనే మాట, ఎంతో అనుభవం కాచి వడబోసి మరీ అన్నారేమో పెద్దలు అనిపిస్తున్నది. వర్తమాన పరిస్థితులనుబట్టి చూస్తే, పెళ్ళిఅయినప్పటికీ, ఆడవారు మగవారితోనూ, మగవారు ఆడవారితోను, చనువుగా మెలిగే ఈ రోజుల్లో ఈ మాట నమ్మేదెట్లా అంటారేమో ? ఆ సందేహం అక్కర్లేదు. అసలు అనుమానమనే బీజం మనసులో పడనేకూడదు. పడిందా అది మొలకెత్తి మహావృక్షం కావటానికి మామూలైన ఆహార, పానీయాలు దాని వెనువెంటనే ఆట్టే శ్రమలేకుండా అంది పుచ్చుకున్నట్టుగా అమరుతాయి. మనకు పనికిరాని విత్తును తెలిసో తెలియకో మనయింటి ఆవరణలోనే నాటుతామనుకోండి. పైగా దానికి తగిన నీరుపోస్తే మహావృక్షమై, దానివేళ్ళన్నీ భూమిలో గట్టిగా నాలుగువైపులా వ్యాపించుతాయి. అది నిరుపయోగమని నిజంగా తెలిసికొని దాన్ని కూకటివ్రేళ్ళతో సహా కూల్చాలంటే ఎంతశ్రమో ఆలోచించండి. అసలు పెకలించడం కష్టం. ఏ గాలివానకో అది కూలిపోవాలి. అలా కూలేటపుడు ఇంటినికూడా పెకలించిపారేస్తుంది.

చాడీకోరులూ, లేనిపోనివి కల్పించిచెప్పేవాళ్ళే దానికి బలమైన ఆహార పానీయాలు. అందువల్ల నమ్మిచెడినవారు లేరు అన్నమాటకి దీనికిమటుకు సుతరామూ వర్తించదు. దీనికిమందు ఒకటే. అసలు అనుమానాన్ని మనసులో పెట్టుకోకపోవటమే మంచిది. మగవాడికి ఆడదానిమీద అనుమానమున్నా, ఆడదానికి మగవాడిమీద అనుమానమున్నా ఆ సంసారం నాశనమే.

### నమ్మి చెడినవారు

ముందు మన సంగతే చెప్తాను. (ముందే మగవారిసంగతి చెప్పానంటే విరుచుకు పడతారు). మాకు తెలిసినావిడ ఒకరున్నారు. ఆమె కాపురానికి రాగానే ఇరుగు పొరుగు అమ్మలక్కలు మీ ఆయన సినిమాలకు, క్లబ్‌లకు వెళ్ళి రాత్రి 12 గం॥లకు ఇల్లు చేరతాడు. జాగ్రత్తమ్మా అని హితోపదేశం చేశారు పాపం. ఆ రోజే పాపం అతను ఒక స్నేహితునింటికి వెళ్ళాడు. ఆ స్నేహితుడు ఆరోజే కొత్తరకం సెంటుకొన్నాడట. బాగుందేమో చూడరా అని ఇతనికికూడా కొంచెం పులిమి బలవంతంగా సినిమాకు తీసుకుపోయాడు. రాత్రి పదిగంటలకు

**ఎ. సత్యవతి**

ఇంటికివచ్చాడు. పొద్దున అమ్మలక్కలు చెప్పినదానికీ, ఇతను వచ్చినదానికీ సరిగ్గా సరిపోయింది. పాపం ఇంకేముంది గుమ్మంలో అడుగుపెట్టాడో లేదో మానవుడు "అర్ధరాత్రిదాకా ఎక్కడికెళ్ళారండీ, అయ్యో! అదేమిటి సెంటువాసన అన్నదట. స్నేహితుడు పూశాడు. బలవంతంచేస్తే సినిమాకెళ్ళాను" అని ఎంత చెప్పినా నమ్మలేదు. ఎక్కడైనా మగవాళ్లు అంత ఘుమాయించే సెంటు వాడతారటండీ, చెప్పండి ఎవతె ఇంటికి వెళ్ళి వచ్చారో" అని కూచుంది. ఎంత చెప్పినా ఆమె వినలేదు. అతను మంచివాడు కాబట్టి వాగనీ లెమ్మని ఊరుకున్నందుకు రోజూ ఆ సెంటునుగురించే వేధించేది. ఆ రోజు నుంచి ఆఫీసునుంచి ఆలశ్యంగా వచ్చినా సాధింపులే, కొంచెం వనుండి ఆఫీసుకు ముందుగా పోయినా సాధింపులే. రాత్రి భోజనం చేయగానే సిగరెట్లు లేకుంటే దగ్గర కొట్టుకెళ్ళి కొనుక్కుందామన్నా వెళ్ళనిచ్చిందికాదట ఒకనాడు. ఎన్నిరోజులని ఈ సాధింపుల కోర్చుకుంటాడు. ఇక ఓర్చుకోలేక ఆ రోజునుంచి కొట్టటం మొదలుపెట్టాడు. అయినాసరే ఆమె సాధించటం మానలేదు. అప్పటినుంచి, ఇప్పటిదాకా ఆ సంసారం కొట్లు, తిట్లు, సాధింపులతోనే సాగుతున్నదికాని బాగుపడలేదు. అతనిమీద ఆమె అనుమానం అలా స్థిరంగా నిల్చిపోయింది.

### కొరివితో తలగోక్కున్నట్టు

చెప్పొచ్చే దేమిటంటే మగవాడు లేకలేక మొండికెత్తి, అవును నీవుకాక నాకు ఇంకా పదిమంది వున్నారు అంటేమాత్రం చేసేదేముంది ? పైగా రోజూ, ఈ పోరు పడలేక ఇంకొకదాన్ని చేసుకున్నా చేసేదేమీ లేదు. తరువాత తన జీవితం వ్యర్థమేగా. తనంతట తాను దారిచూపించి తలకు కొరివి తగిలించుకున్నట్లవుతుంది.

# ★ అనుమానాలు

## కళ్ళారా చూశాక

మన కళ్ళారా మనం చూసిందాకా, దానికి తగిన ఋజువులు దొరికిందాకా ఒకరిపై ఒకరు మోయలేని అభాండాలు వేసుకొని కూసవోవద్దు. తన భర్త ఒకామెతో మాట్లాడటం చూసిందనుకోండి చూస్తే మాత్రం, అతను మాట్లాడినంతమాత్రాన పెడర్థాలు తీసుకోవలసిందేనా. అతను ఇంకొకరితో అనేక విషయాలను గురించి మాట్లాడివుండవచ్చు. మగవాడైనా అంతే అనుకోవాలి. కాని ఇంకేముంది నా భార్య పరాయి మగాడితో మాట్లాడితే మాట్లాడింది. ఆమె ప్రవర్తన మంచిదికానట్టే అనుకోకూడదు. మనసు మంచిదికావాలికాని ఎవరితో మాట్లాడితే ఏముంది? మనసు మంచిది కాకుంటేమాత్రం ఒకరినొకరు కనిపెట్టగలరా? కనిపెట్టినా అది వృథా ప్రయాస అవుతుంది. వారి మనసు ఎప్పుడూ, పెడత్రోవలే త్రొక్కుతుంది.

## తొందరపాటు చేటు

ఎంత ప్రాణస్నేహితులైనా ఈ విషయంలో నీ భర్త ప్రవర్తన మంచిదికాదు అని చెప్పినప్పుడు 'అలాగా' అని వూరుకోవాలే కాని, వెంటనే అదే నిజమనుకొని నమ్మి యథార్థం తెలుసుకోకుండా భర్త ఎప్పుడు ఇంటికి వస్తాడా ఎప్పుడు అడుగుదామా అన్నంత ఉబలాటం పెట్టుకోకూడదు. మనసులో పెట్టుకొని యథార్థం తెలిసికొని భర్త నిజంగా తప్పుదారిపట్టిన పక్షంలో మంచిమార్గాన పెట్టటానికి ప్రయత్నించాలి. అతని ప్రవర్తన మంచిదిగనక అయితే పశ్చాత్తాపపడవలసి వస్తుంది.

ఇంకా మగవాళ్ళయినా, 'నీభార్య ప్రవర్తన మంచిదికాదురా' అని ఎవరైనా చెప్తే మనసులో పెట్టుకుని అందులోని యథార్థమెంతో తెలిసికోటానికి ప్రయత్నిస్తారు. మన ఆడవారిలో అటువంటి సహనం కొద్దిమందికో తప్పితే ఆవిన్నమాట మగవాడిని ముఖంపట్టుకొని అడిగేదాకా మనసుండబట్టదు. అలా అడిగేవాళ్ళు మగవారిలోనూ వున్నారు. కాని చెప్పేవాళ్ళని బట్టి చెప్పాల్సిన పనే తక్కువేమో అనిపిస్తుంది.

మా వూళ్ళో ఒకమ్మాయివుంది. ఎప్పుడో ఎవరో అన్నారట. కాలేజీలో ఆడపిల్లలతో కలిసి చదివినవాళ్ళ ప్రవర్తన మంచిగా వుండదని. అది ఆఅమ్మాయి మనసులో నాటుకుపోయింది. ఖర్మకాలి అలాంటి కాలేజీలో చదివిన భర్త దొరికాడు. ఆమెనెంతో ప్రేమగా చూస్తాడు. కోరిన చీరలు, సినిమాలు, షికార్లు అన్నీ చక్కగా వున్నప్పటికీ, "మీరు కాలేజీలో చదివేటప్పుడు ఎంతమంది అమ్మాయిలను ప్రేమించారో అని అంటుంది" అలా ప్రేమించటమే జరిగితే ఆమెనంత ఆప్యాయంగా చూడగలుగుతాడా? జీవితంలో ఒకరు ఒకరినే ప్రేమిస్తారని ఈ కోవకు చెందిన స్త్రీపురుషులకు తెలియదు కాబోలు. ఒక్కోసారి ఇటువంటివారి మానసిక బలహీనత చూసి జాలీ, కోపం రెండూ కలుగుతాయి. ఇలాగ అనేవాళ్ళు పురుషుల్లోనూ వున్నారు. ఒకరకం మగవాళ్ళున్నారు. వారిభార్యలు ఇతరులతో మాట్లాడితే సహించరు. మళ్ళీ భార్యలు మంచివారే అని నమ్ముకుంటారు. కేవలం ఎప్పుడో, ఎక్కడో విన్న విషయాన్నే మనసులో పెట్టుకుని స్పర్థలు పెంచుకుని అనవసరపు అనుమానాలను మనసులో చోటియ్యకూడదు.

## అనుమానమైన అనుమానం

మాయింటిపక్కన ఒకాయన రెండేళ్ళుండిపోయాడు. ఆయనకు అనుమానమే ఆహారమేమో అనిపించేది. తను వూరికెళ్ళబోతూ భార్యతో తలదువ్వుకోవద్దు, మంచి చీరె కట్టుకోవద్దు అని గమ్మత్తు మాటలలో చెప్పిపోయేవాడు. ఒకసారి ఆయన వూరికెళ్ళినపుడు తప్పనిసరి పేరంటమొచ్చి తలదువ్వుకొని, పూలు పెటుకుని కొత్తచీర కట్టుకుంది. వెళ్ళాలనుకుంటూండగా భర్త వచ్చాడు తలదువ్వుకొని, పూలు పెట్టుకున్నదని ఆమెనీ పిల్లల్నీ కలిపికొట్టాడు ఇంకా నయం, స్నానం భోజనంకూడా తను వూళ్ళో లేకుంటే మానేయమనలేదు.

## తలవంపు తలంపు

మా బంధువుల్లో ఒకాయన వున్నారు. విదో పెళ్ళికెళ్ళినప్పుడు భార్య తన మేనబావతో మాట్లాడిందని అనుమానపడి, అంతకాడికి మీ బావనే చేసుకోలేక పోయావా నన్నెందుకు చేసుకున్నావని అవమానపరచి విడాకుల కాయితం రాసిస్తావా లేదా అని కూచున్నాడు. పెళ్ళికొచ్చిన పెద్దలంతా





చీవాట్లు వేస్తే వూరుకున్నాడు. కానీ ఇప్పటికీ, రోజూ కొక్కసారైనా మా బావను చేసుకోకపోయావా అంటాడుట.

మొన్న మా అన్నయ్య సినిమాకు వెళ్ళి వచ్చాక తలవని తలంపుగా క్లాసుమేటు కనిపించి పలుకరించిందట. వెనుకటి స్నేహాధారంగా, చనువుగా మాట్లాడారు. ఆ మాత్రానికే మా వదిన అతన్ని అపార్థం చేసుకొని ఎన్నో మాటలంది. నా భర్త మంచివాడే అన్న బలమైన నమ్మక మున్నప్పుడు మాట్లాడితే మాత్రమేం అనుకోవద్దూ?

మా స్నేహితురాలొకావిడ మెట్రిక్ చదివింది. చిన్నప్పుడే పెండ్లయింది. భర్త అనుమానపిశాచానికి అత్యంత ప్రియమిత్రుడు. పైగా కోపిష్టి. ఆమె పెద్దమ్మకొడుకు పక్కలో కూచున్నదని. ఎంత అన్న అయితే యేం? పరాయి మగాడు కాదూ అని కొడితే ఆయన తండ్రివచ్చి ఆడపిల్లమీద అలా చెయి చేసుకోకూడదు నాయనా అన్నందుకు నా భార్యమీద నీకెందుకింత అపేక్ష, ఆమెకూ. నీకూ, ఏమి సంబంధం అని అడిగాడట అప్పటినుంచి ఆ మానవుడు కోడలితో మాట్లాడిగాని, ఎదురుగా వచ్చిగాని, ఎరుగడు మళ్ళీ భార్య పుట్టింటికొస్తే సుఖంగా వుంటుందట. పట్టుమని పదిరోజులైనా వుంచడు. మా స్నేహితురాలంటుంది. "అది అపేక్షో, అనుమానమో నాకేదీ, తెలియకుండా వుంది" అని. అపేక్షగల మగాడైతే పెద్ద, చిన్న తారతమ్యత లేకుండా అలాటి నోగా పట్టనిమాట లెందుకనవలసి వచ్చింది. ఒకోసారి ఇలాటిమాటలుపడలేక ఏనుయ్యో, గొయ్యో చూసుకున్నా చూసుకోవచ్చు.

ఒకరకం పురుషులున్నారు. కుడుందగ్గ మజ్జిగ దేవతార్చనదాకా వారికే కావాలి పంచదార అయిపోయింది పట్టుకురండి అంటే అప్పుడే అయిపోయిందా ఎవరికి దానం చేశావు అంటారు.

కొందరు స్త్రీలకుకూడా ఇలాటి అనుమానమే వుంటుంది. జీతమంతా ఎవరికి పంపుతున్నాడో, ఎవరికోరకు ఖర్చు పెడుతున్నాడో అని. భర్త ఎంత సంపాదించినా తమకు, తమ పిల్లలకేగదా అనుకోరు. ఖర్మంకాలి ఒకో నెలలో స్నేహితుల్ని సినిమాలకు గానీ, హోటల్ కుగాని తీసుకువెళ్ళాల్సి వస్తుంది. అలాటప్పుడు ఖర్చుపెట్టక తప్పుతుందా? అదంతా ఎవరిముఖాన తగలేస్తున్నాడో అనుకుంటారు. అలాటి ఉద్దేశ్యం వాళ్ళకున్నప్పుడు మగవారు నిజం చెప్పినా నమ్మరు.

ఒకరిమీద ఒకరికి నమ్మకమనేది వుంటేనే ఆ సంసారం రాణింపుకొస్తుంది. నమ్మకమే లేకుంటే అదెలా బాగుపడుతుంది. భర్తను భార్య నమ్మాలి. భార్యను భర్త నమ్మాలి. మనిషిని మనిషి నమ్మకుంటే దెయ్యాం నమ్ముతుందా? ఒకరిమీద ఒకరు అనుమానం పెట్టుకొన్నిమాటలతో చేష్టలతో హింసించుకుంటూ జీవితాని, ముండపొదలా చేసుకునేకంటే,

# మీ అభిప్రాయం ఏమిటి?

శేషమ్మగారు గుంటూరునుంచి విశాఖపట్నంలోని తన కుమారుణ్ణి చూడాలనే ఉద్దేశంతో విశాఖపట్నం బయలుదేరింది. రైలు మెల్లగా బెజవాడ స్టేషనులో ఆగింది. స్వతహాగా శేషమ్మగారి నాలుక అర నిముషంకూడా ఊరుకోదు. తను కూర్చున్న సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్ లో ఇద్దరే ఇద్దరు స్త్రీలున్నారు. వారిద్దరూ కాలక్షేపానికి ఏవో పుస్తకాలు చదువుకుంటున్నారు. అర నిముషమైనా వేస్ట్ చెయ్యని శేషమ్మగారు వారిని మాట్లాడిద్దామా? వద్దా అని తటపటాయించింది.

ఇంతలో ఒకజంట సెకండ్ క్లాస్ కంపార్ట్ మెంట్ దగ్గర ఆగింది. ఆయువతి తన సూట్ కేస్ ను కంపార్ట్ మెంట్ లో పెట్టి తనతో ఉన్న యువకునితో "వస్తా రఘూ! నే వెళ్ళగానే లెటర్ రాస్తాను. వీల్లోపుగా ఒకసారి మేనేజరును కలుసుకో" అంటూ రైలు ఎక్కింది. గార్డు పచ్చజెండా ఊపాడు. రైలు ఒక్క కూతపెట్టి తూర్పువైపుగా ప్రయాణం సాగించింది. ఆ యువతి శేషమ్మగారికి ఎదురుగా ఉన్న సీటుమీద కూర్చున్నది.

శేషమ్మగారు ఎగాదిగా చూశారు ఆ యువతివైపు. ఆ అమ్మాయికి 20 ఏళ్ళుంటాయి. తెల్లగా నాజూగ్గా ఉన్నది. నుదుట నయాపైసంత బొట్టు పెట్టుకొంది.

నెమ్మదిగా ఆ యువతిని మాటల్లోనికి దించింది శేషమ్మగారు.

"ఎందాక వెళ్తున్నావమ్మా?"

"సామర్లకోట వెళ్తున్నానండి." ముక్తసరిగా జవాబిచ్చింది ఆ యువతి.

"నీ పేరేమిటన్నావే?...అయినా యీకాలం పిల్లలపేర్లు మరీ నోరు తిరగవమ్మా. నళినీట, వకుళట," ఇంకా, ఇంకా చిన్న లెక్చరిచ్చింది శేషమ్మ. "నా మతిమండ. ఇంతకీ నీ పేరేమిటో తెల్సుకోనేలేదే!" అంది చివరకు.

"నా పేరు వెంకటరమణండి."

"వెంకటరమణా! చక్కని పేరు. నీకు పెళ్ళి అయినదామ్మా?"

"అయిందండీ." సిగ్గుపడుతూ జవాబిచ్చింది రమణమ్మ.

"అనుకున్నానులే, నీ బొట్టూ అదీ చూస్తే. ఈ కాలం పిల్లలు చీమంత బొట్టు పెట్టుకొంటారు. ఏమి ఫేషనోనమ్మా."

"పెద్ద బొట్టు ఈ కాలం ఫేషన్ అని తెలియదు కాబోలు" అని రమణ మనస్సులో అనుకొని నవ్వుకొంది

"నీ వొక్కదానివే వస్తున్నావేమమ్మా, మగవాళ్ళు రాలేదేం?"

"వారికి సెలవు యివ్వలేదండి"

"నీకు ఎంతమంది పిల్లలన్నావమ్మా?"

"నేనేమీ అనలేదండి...నాకు ముగ్గురు పిల్లలు."

" ందమ్మా. ముచ్చటగా ముగ్గురు...మరి పిల్లలను తీసుకొని రాలేదేం?"

"వాళ్ళు తండ్రిని వదలి రారండి!"

"అవునులేమ్మా. ఈ కాలం పిల్లలకి అమ్మదగ్గరకంటే నాన్నగారిదగ్గరే అలవాటు."

రైలు నెమ్మదిగా ఏలూరు స్టేషనులో ఆగింది. ప్లాట్ ఫారమంతా జనసమూహంతో కిటకిటలాడుచున్నది. రమణమ్మ తన సూట్ కేస్ ను చేతితో పట్టుకొని దిగుచు "ఏమండీ పిన్నిగారూ! నాకు పెళ్ళికాలేదండీ ఇంటర్ వ్యూకు పిలిస్తే వెళ్ళివస్తున్నానండీ. మీరు కాలక్షేపానికేవో అడిగారు, నేనేవో చెప్పాను. క్షమించండి" అంటూ దిగిపోయింది

"అరె బలే పిల్ల! ఈ కాలం పిల్లలూ!" అంటూ ఒక నిట్టూర్పు విడిచింది శేషమ్మగారు.

—ఇ. నిర్మల, లక్ష్మి.

రచయిత్రులు ఈ సంఘటనకు 'కలికాలం పిల్లలు' అని పేరుపెట్టారు. ఇది కథలో అమ్మాయి వెంకటరమణమ్మ అలా పెద్దవాళ్ళ దగ్గర అబద్ధాలు చెప్పి హేళనచేయడం తగదన్న అభిప్రాయంతో. ఈకథ విన్న ఇంకొక అమ్మాయి దీనికి యీ శీర్షిక తగదంది. కొందరు పెద్దవాళ్ళు అపరిచితుల స్వంతవిషయాలన్నీ అడిగి ఇష్టంవచ్చినట్లు వ్యాఖ్యానాలు చేస్తారనీ అలాటివాళ్ళమీద ఇది విమర్శ కాబట్టి దీనికి 'శాస్తి' అని పేరుపెట్టాలనీ అంది.

మీ రేం పేరు పెడతారు?

# ★ ఉత్తరాలు ★

(2 వ పేజీ తరువాయి)

## సినీమా, స్కోపూ

సినీమాకళకి ఉందని పెద్దలంతా అనుకుంటూవచ్చిన స్కోపు కాస్తా, సినిమా స్కోపువంటి టెక్నికల్ హంగులతో మాత మారిపోయిందని హాలీవుడ్ ఋజువు చేసింది. టాడ్-ఎ. వో, సినేరమా, సర్కోరమా లాంటి పెద్ద తెరలు రమారమి అరడజను రావడంతో ముమ్ముందుకూడా ఆ ఆశ లేదని నిరాశ కలుగుతుంది. వీటివల్ల బొమ్మలకి ఎత్తూ, లోతూ అబ్బితే అబ్బివుండవచ్చుగాని, సినిమాకళకుమాత్రం ఆ లక్షణాలు రెండూ పట్టడం లేదనీ, ఉన్నవి కాస్తా ఈ గొడవలో హరించిపోయాయని విదేశీయుల విమర్శలు పరామర్శిస్తే తెలుస్తుంది.

ఇపుడు మనదేశం నిర్మాతలు తీరిక వేళలలో విదేశాలకువెళ్ళి నానారకాలూ పట్టించుకురావడానికి కృషి చేస్తున్నారని వార్తలు చూసి చాలా భయపడుతున్నాము. ఇప్పుడు అంతంతమాత్రంగావున్న మన చిత్రాలకు ఈ బాల్యదశలోనే ఈ అరిష్టాలు సంప్రాప్తమైతే సినిమా ఏంకాను!

డి. విశ్వేశ్వరరావు (డెహ్రాడూన్)

## మేడిన్ అమెరికా?

'పొర పొచ్చాలు' వ్యాసం ఇండియాలో మనిషి రాసినట్టు కనబడలేదు. దంపతుల కోసం రాసినట్టూ అవుపించదు. అమెరికన్ దంపతుల సమస్యలు చూసి వాటిని మనకి పట్టించి రాశారేమో.

ప్రభావతీ రామకృష్ణ. (న్యూఢిల్లీ)

## రెడీమేడ్ భావాలు

అన్ని సమస్యలమీదా అందరికీ నిక్కచ్చి అయిన అభిప్రాయాలు ఉంటాయనుకోవడం శుద్ధ పొరపాటు అని నా నమ్మకం. నేను తెలివైనవాణ్ని నాకే లేవు. (పొగరనుకోకండి) ఈ ఆడవాళ్ళసంగతి అందులో మనదేశంలో "వాళ్ల సంగతి చెప్పాలా? అందువల్ల దాంపత్యంలో పొరపొచ్చాలకి కారణాలు అభిప్రాయభేదాలు కావన్న విషయంలో భేదాభిప్రాయాలు ఉండనక్కరలేదు. మనం అన్‌సివిలైజ్‌డ్ అని మరొకళ్ళు అనుకున్నా సరే. ఆ కారణంవల్ల కనకదుర్గ గారి వ్యాసంలో సగం పిచ్చిలుకు చెత్త అని నా అభిప్రాయం. ఆవిడ నొచ్చుకోరని ఆశిస్తున్నాను.

సి.హెచ్. రామారావు (విజయవాడ)

## నమ్మిక

చదువుకొని, ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలు, "నేను కూడా డబ్బు గడిస్తున్నాను" అన్న అహం భావాన్ని పోగొట్టుకుంటే, జీవితాలు హాయిగా ఉంటాయని, 'మార్పు' వ్యాసం ఈ విధమైన మార్పు రావడానికి తోడ్పాటు చేస్తుందని నా నమ్మకం ...ప్రభావతి గారిచ్చిన రెండు గలీబుల డిజైను ఒక రోజులో కుట్టాను. చాలా బాగా కుదిరింది. వారికి నా ధన్యవాదాలు.

డి. సరోజమ్మ (పులివెందుల)

## నమ్మక

'అందాల బాటలో తొలి మలుపు' వ్యాసం చదివాను. అవన్నీ నియమంగా పాటించగల వారెందరు? ఒకవేళ అన్నీ తిన్నా ఒళ్ళురాదు. అది స్వభావమును బట్టి ఉంటుంది.

కుమారి బులుసు సుశీ (రెంగాలి-ఒరిస్సా)

## వర్ధి అర్భకులు

మనవరాలూ దాని మొగుడూ ఇంగ్లీషులో తగువులాడుకుంటుంటే, ఉండబట్టలేక ఏవిటర్రా ఆ గిల్లికజ్జాలూ అని అడగబోయాను. వాళ్ళేదో భావలో అనుకుంటున్నారు- అవి సరసాలో ఏవిటో నీ కెందుకు ముసిల్దానివి నీమానాన నువ్వోదగ్గర పడుండక అవటాని ఓ మూల మా ముసిలాయన అంటూనే ఉన్నాడు. అంతలోకే ఏమొచ్చిందో ఏమో పిల్లది గుప్పనీరుకుక్కుకుని గదిలోంచి ఇవతలి కొచ్చేసింది. ఏవిటే మాతల్లీ అని కనుక్కుంగునుగదా ఆలుమగల మధ్య తగువులు ఉండకూడదని అతగాడంటే ఉండాలనిఅదందిట. ఆ కాణ్ణించి అతను రెచ్చిపోయి తిట్టిపోశాట్ట— అంత తగువులు తగవన్నవాడూను! ఇది మటుకు తీసిపోయిందా. కజ్జాలుండా లన్నదల్లా తీరా ఓటి వచ్చేసరికి నీళ్లు కుండ దించేసింది. ఇంతలో ఉంటాయి ఈ కాలప్పిల్లల తత్వాలు, ఇలాంటి వాళ్లు అసలిలాటి విషయాలమీద మాటాడుకోవడమే మంచిదికాదు.

ముంజులూరి రామసీత, (శ్రీకాకుళము.)

## వనితలకు వినతి

తెలుగులో వ్యాసాలు రాసేవారు— ముఖ్యంగా వనితలోకానికి—అలా వ్రాసేటప్పుడు ఇంగ్లీషు మాటలు వేసి బాధ పెట్టవద్దని కోరుచున్నాను.

పి. శేషు,
(కనిగిరి.)

## ఓపిక పట్టబిట్టి !

"బి. ఇందిరారాజ్ రాసిన "మార్పు" వ్యాసము మొదట్లో వ్యాసము కాస్తంత ప్లాట్ ఫారమ్ స్పీచ్ లా వుండి అతిశయోక్తి అనిపించినా చివరంటా చదివితే ఆమె విమర్శన అభినందనీయమైనదని తప్పక తోస్తుంది."

దుగ్గిరాల రామారావు.
(ఏలూరు)

> ఒక బ్రహ్మచారిణి ఒక బ్రహ్మచారిని, జీవితనౌకాయానంలో తోడుగా ఆడదిక్కు లేకుండా ఉండటమేమని ప్రశ్నించింది.
>
> అందుకా బ్రహ్మచారి ప్రత్యుత్తరంగా- నా జీవిత నౌక ప్రయాణించినంతవరకు సముద్రం ఎక్కడా ప్రశాంతంగా లేదు-అని అదోలా సమాధానం ఇచ్చాడు.

'ఒకరికి ఒకరు' వ్యాసము చదివాను. చాలా బాగుంది.

షేక్ ఆగామా ఆఫీత్ ఖాన్ బీబీ
(పాసను, ఒరిస్సా)

## గడువు

మన సమాజం ఎంత ముందుకుపోతున్నా ఇంకా స్త్రీ తక్కువ, పురుషు డెక్కువ అనే భేదం సమసిపోలేదు. పూర్వపు పద్ధతి ప్రకారము పురుషుడే చేయవలసిన ఉద్యోగం, ప్రస్తుత కాలములో స్త్రీ కూడా చేస్తున్నప్పుడు, స్త్రీకి ఇంటిపనుల్లో పురుషుడు సహాయపడితే తప్పు లేదు.

నా భర్తకు నేను ఎందుకు అణగి మణగి పడివుండాలి అని అనుకోవడం పొరపాటు అంటూ వ్రాశారు. కాని ఏ స్త్రీ సాధారణంగ అలా అనుకుంటుందని తోచదు. ఎవరో నూటికొక్కరుంటారేమో.

కాని భర్తచేత తప్పక పని చేయించుకోవాలని సాధారణంగ ఏ స్త్రీ కోరదని నా నమ్మిక. మనసమాజం ఇంకా ప్రగతిని సాధించటానికి కొంతకాలము పడుతుంది.

కె. ఎస్. లక్ష్మి, (ఏలూరు.)

## పావురాలు

మేము మా యింట్లో 80 పావురాలను పెంచుతున్నాము. ఏ కారణంవల్లనో వరసగా కొన్ని పావురాలు చనిపోయాయి. 'కోమలిని పెంచేవిధానం'పై మీరు వేసిన వ్యాసం చూచినమీదట, పావురాల పెంపకంపై కూడా ముఖ్యవిషయాలు తెలుపుతారేమో నని ఈ లేఖ వ్రాస్తున్నాను.

సావిత్రీ మదన్, (బందరు.)



#  ఋణానంద లహరి 

(11-వ పేజీ తరువాయి)

చీమ మందహాసం చేసింది.

"అమ్మాయి...ఇలాంటి పాడు పుకథలే కాదు నేనింకా చాలా చెప్పగలను... అయినా నువ్వడిగింది చెబుతా. ఈ పుట్ట ఇంకా మీదే అనుకుంటున్నావు కాని కాదు. మీకూ దీనికీ ఋణానుబంధం తీరిపోయింది. మిగిలింది మీకూ మాకూను. అంచేత ఇక నించి ఇది మాది" అంది.

"పాములు పెట్టిన పుట్టలు చీమల కెరవైనయట్లు" అన్నాడు సుబ్బన్న విచారంగా.

"ఛస్...'పాములు పెట్టిన' కాదు చీమలు పెట్టిన..." అంది నాగలక్ష్మి కోపంగా.

"అచ్చు తప్పు పడిఉంటుంది నువ్వు చదివిన పుస్తకంలో...పాములే రైటు. ఆ కాలంకల్లా కూడా ఇది మాదే లేదా నువ్వన్నట్టు చీమలు పెట్టిన పుట్టలే అయినా కూడా ఇది మాదే. అంచేత ఏ విధంగా చూసినా—" అంది చీమ

బుస్సుమంది నాగలక్ష్మి. సుబ్బన్నకి కూడా తిక్క వేసుకొచ్చింది. ముందుకు దూకబోయాడు.

"ఆగె ఆగె ఆగు..." అంది పెద్దచీమ. "నాయనా ఆడదానిమాట విని తప్పుదారిన పడకు. నువ్వు పూర్వజన్మలోమాకు ఇంటద్దె బాకీ ఉండి ఉండవచ్చుగదా. అంచేత మేము ఈయిల్లు వేవాగ్నిగా తీసుకొన్నా తప్పులేదు...పాతబాకీ కాకపోయినా, నువ్వు ఏడారు జన్మల తరవాత కోటికిపడగెత్తి ఖ్యాతి, వెలకొద్దీ అద్దెకొంపలకు యజమాని కాగల ప్రమాదం ఉంది. ఈ చీమలన్నీ అప్పుడు అక్కడ అద్దెకి దిగవచ్చు నువ్వు రూపాల ఇంటికి పాతిక వసూలు చేయవచ్చు, అప్పుడు పడగల బాకీకి ఇప్పుడు అడ్వాన్సుగా ఈ యింటి రూపేణా జమ కడితే, దేవుడికి మొక్కుబళ్ళు తప్పుతాయి గదా అప్పుడూ."

సుబ్బన్న సందేహంగా భార్యవంక చూశాడు. ఆమె పడగ ఆడించింది.

"నాకీ జన్మలలోనూ గిన్మలమీదా నమ్మకంలేదు. అంతా ఈ తిరగమాటలు నిజ...బాకీలేదు కాకీలేదు" అన్నాడు సుబ్బన్న ధైర్యంగా.

కావ్ కావ్ మంది చెట్టుమీది కాకి

"మా కాకా నువు కాకి లేదంటె ఉన్నానని పైనించి సాక్ష్యం...అలాగే బాకీకూడా ఉండేవుంటుంది" అంది చీమ.

"వాళ్ళమాట నమ్మకు" అని రెచ్చగొడుతోంది నాగలక్ష్మి.

సుబ్బన్న పడగెత్తి ఏదో అనబోయాడు.

* * *

[illegible]

"ఓయీ అమాయకుడా! నీ పక్కనున్న దానిమాటే నమ్మకు. అది ఎవరనుకుంటున్నావు? నీ భార్య అనా? పొరబాటు. ఆమె అసలు పేరు ఋణసుందరి. నూరేళ్ళ క్రితం నువ్వు ఋణదత్తుడి జన్మలోఉన్నపుడు ఈవిడకి బాకీపడ్డావు. దానితాలూకు బకాయి ఈజన్మంలో వసూలు చేసుకుంటోంది. నిన్న నీకోరలు పీకించింది ఎందుకనుకున్నావు?" అంది పెద్దచీమ.

సుబ్బన్న తెల్లబోయి నోరువెళ్ళబెట్టాడు.

చెట్టుమీది కాకమ్మ ముందుకు వంగి తొంగిచూసి "ఇందాక చెప్పింది నిజమే: సుబ్బన్నకి కోరలు పీకేశారు పాపం. అందుకే ఇందాక లేడిభయపడలేదు" అంది.

మొగుడుమాటాడలేదు.

ఆడదానిమాట వినడంకూడా ప్రమాదమే అతనికి భయంపట్టుకుంది. సరిగ్గా మూడు రోజులక్రితం సుబ్బన్న మాంచి పొగరెత్తిన కోడెత్రాచు. ఇవాళ ఉట్టిబోడితాచు. ఆరోజు అతనూ నాగలక్ష్మి చెట్టుకింద ఆడుకుంటూండగా ఓపాములవాడు వచ్చాడు. నాగలక్ష్మి వాణ్ణిచూడగానే గతుక్కుమంది. ఒకనిముషం తరవాత, మొగుడిని పిలిచి, వాడికి దొరికిపొమ్మంది. వాడుపాపం బీదవాడుట. సుబ్బన్న పట్టుబడితే తీసికెళ్ళి అమ్ముకుని నాలుడబ్బులు తెచ్చుకుంటాడట. వాడూ అమ్మెయ్యగానే సుబ్బన్న, తనను కొన్నవాణ్ణి కరిచేసి పారిపోయి రావచ్చు. వనక తనుకూడా వచ్చి అక్కడి వాళ్ళని కరిచి మొగుణ్ణి విడిపిస్తుంది. ఏకళనున్నాడో సుబ్బన్న ఒప్పుకున్నాడు. పాములవాడికి మటుకు ఈపథకం, నాగలక్ష్మి సదుద్దేశం పూర్తిగా బోధపడలేదు. అందుకని సుబ్బన్న దొరకగానే ముందరే కోరలు పీకేసి మరీతీసుకెళ్ళాడు. తరవాత నాగలక్ష్మి పొరపాటుకి నాలికలు కరుచుకుని, వాడి కూడాపోయి పట్నంలో సుబ్బన్నని వాడెవరికో అమ్మగానే వాళ్ళని కరిచేసి అతన్ని విడిపించుకు దక్కా తీసుకొచ్చింది. అయితే మటుకేం? సుబ్బన్న కోరలో!

అవి వుంటే ఈ చీమలు ఇన్ని నీతులు మాటాడగలిగేవా?

సుబ్బన్న కూడా ఆమాటే అనుకుంటున్నాడు దిగాలుపడిపోయి. చీమ ఓదార్చింది "ఫరవాలేదు. ఋణదత్తుడా విచారించకు. నీకూ నీ కోరలకీ ఋణం తీరిపోయింది. ఈ ఋణానుబంధాలు లోకం మీద అంతటా ఉన్నవే. నీ కింతచేటు తెచ్చింది చాలక ఇంకా తేవాలని చూస్తున్న నీ భార్య నాగలక్ష్మి అను ఋణసుందరికి నువ్వెలా బాకీ పడ్డావో ఆ కథాక్రమమిప్పుడు గుర్తు చెయ్యనా?' అంది.

(పై వారం ఋణసుందరి కథ)



ఊగుతుంది. అక్కరలేని నగీషీగా కనిపించింది. దీనికితోడు నయ్యార్ కూర్చిన పాటలు కూడా (క్యాకరోగి మినహా) అంతంత మాత్రంగా ఉన్నాయి. బాగున్న కొన్ని ట్యూనులో-సి-రామ్, భోలా శ్రేష్ఠ ప్రభృతుల పాట వరుసలను గుర్తుకు తెస్తాయి. మనసుకు హత్తుకునేవల్లా కమర్ జలాలాబాదీ రాసినమాట వరుసలే.

ఒక్కసారిగా తారస్థాయిని అందుకొన్న నయ్యర్ ను అందరం ఉత్సాహంతో రాకెట్ తో పోల్చారు. ఆయన ఇటీవల కొన్నాళ్లుగా వినిపిస్తున్న సంగీతం వినగా ఇప్పుడు ఈ సామ్యాన్ని సవరించి 'అమెరికన్ రాకెట్'మటుకే అనుకోవలసొస్తోంది.

సంగీతంలాగే, కథలో యాదృచ్ఛిక సంఘటనలూ, సినీమార్కు కోర్టు సీనూ, గ్రూపు ఫోటో వగైరాలు చాలా పేలవంగా ఉన్నాయి. అమాయకత్వానికి గరిష్ఠ ప్రమాణాన్ని సూచిస్తాయి. ఇన్ని లోపాలు ఉన్నా, చిత్రం అతివేగంగా సాగిపోవడమే 'దో ఫుస్తాబ్'లో పెద్ద విశేషం. దర్శకుడు హరీష్, ఛాయాగ్రహణ దర్శకుడు జి. వసంత్, ఎడిటర్ ఎన్. ప్రభాకర్ లను ఇందుకు మెచ్చుకోవాలి.

## ముద్దు ముచ్చట

పెద్దవాళ్లకు ఎన్నో సరదా లుంటాయి. ముద్దూ ముచ్చటా ఉంటుంది. ఒక్కొక్కసారి అవి చూసేవాళ్ళకి కూడా ముచ్చటగా ఉంటాయి. ఒక్కొక్కసారి రాణిస్తాయి... గాంధీగారు చిన్నపిల్లని దగ్గరకు తీసుకుని మూర్ధం ఆఘ్రాణిస్తే బావుంటుంది. జవహర్ లాల్ గారు ముద్దొచ్చిన చిన్నవాడినో, చిన్నదాన్నో చేరదీసుకుని ముద్దిస్తే అది ఆయనకి చెల్లిందనిపిస్తుంది.

మెహబూబ్ ఖాన్ ఫిలిం పరిశ్రమకు పూజనీయుడే. చాలా పెద్దవాడే అయినా ఆయన ఇలాటి ముచ్చట్లకు పడిగడితే ఎబ్బెట్టుగా ఉంటుందని గిట్టనివాళ్ళన్నా తప్పుపట్ట కూడదు. గతవారం 'అనాడీ' చిత్రం రజతోత్సవంలో, మెహబూబ్ ఖాన్ ఈ పనే చేశారు. ఆ చిత్రం నటీనటులకూ, టెక్నిషియన్లకు, దర్శక నిర్మాతలకూ బహుమతులు అందచేసే సమయంలో కరచాలనమో, నమస్కారమో పెడితే చాలదని అనిపించి ఉండాలి. అంతేకాదు. బహుమతి గ్రహీత లందరినీ ముద్దుపెట్టుకోవడం ద్వారా తన ఆనందం బాగా వ్యక్తమవుతుందని తోచి ఉండాలి. దర్శక నిర్మాతలను తేలిగ్గా వదిలేసినా, నటులలో రాజ్ కపూర్ దగ్గరనించి మొగాళ్లందర్నీ ముద్దు పెట్టుకున్నారు. వృద్ధనటి లలితాపవార్ ఈవిధమైన అభినందనకు గురి అయినపుడు, సిగ్గుతో ఆమెముఖం కందగడ్డలా అయిపోయింది. లతామంగేష్కర్ వేదికమీదికి వెళ్తున్నపుడు జంకుతూనే


'దైవబలం'లో రామారావు, గుమ్మడి, జయశ్రీ

వెళ్ళింది. ఆయన కప్పు అందించి ముందుకు వంగేసరికి, చాకచక్యంగా తప్పించుకు బయటపడింది.

తరవాత ఖాన్ జీ నవ్వుతూ "అసలు విషయం ఇది" అని ఆవేశంతో వెల్లడించారు. అది. ఈ ఉత్సవానికి నూతన్ వస్తుందన్న ఊహతో, ఈ గమ్మత్తు ఊహను ఆచరణలో పెట్టారట. కాని గమ్మత్తేమిటంటే, నూతన్ రాలేదు. ఆనాడు ఆమె సిమ్లావెళ్లి ఔట్ డోర్ షూటింగ్ లో పాల్గొంటోంది!

## వహీదా

కల్పనా ఫిలింస్ వారి 'ఏక్ ఫూల్ చార్ కాంటే' సెట్ పైన గతవారం వహీదా రహమాన్ తటస్థపడింది. వహీదా మద్రాసు నుండి వచ్చిన నాటికీ నేటికీ చాలా మారిపోయింది. ఇప్పుడు ఆమె చాలా అందంగా పుష్టిగా ఉంది!

ఆరోజున ఆమె తెల్లటి పట్టుచీర కట్టుకుంది. ఆభరణాలేం పెట్టుకోకుండా నిరాడంబరంగా అందంగా ఉంది. మనిషి చామంతి చాయకి ఓ చాయ తక్కువైన చామనచాయ. ఎత్తరి కాదు. పొడుగు కాదు. అయినా సమగ్రమనిపించే విగ్రహం వల్ల పొడుగ్గా ఉన్నట్టనిపిస్తుంది. ఆరోజున ఆ 'ఏక్ ఫూల్ చార్ కాంటే' చిత్రానికి చాలా పెద్దసెట్ వేశారు. దాంతేశ్వరి దేవాలయం. నిర్మాణాన్ని చూడగా చిత్రనిర్మాణంకూడా అంత శ్రద్ధగానూ, కట్టుదిట్టంగాను జరుగుతూ ఉందా అనిపించింది.

# విదేశ వార్తలు

దేశదాస్య విముక్తికై, జపాన్ సహాకారంతో జాతీయసైన్యం ఏర్పాటు చేసిన నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఉద్యమగాథను ఒక జాపనీస్ నిర్మాత చలనచిత్రంగా నిర్మించబోతున్నారు. "హిందూ మహాసముద్రంపై వారధి" అనే కథ ఆధారంగా రూపొందించే ఈ చిత్రంలో ఎస్. టి. గంగీ అనే భారతీయుడు నేతాజీ పాత్రని నిర్వహిస్తారట. ఈయన టోక్యో రేడియోలో ఉద్యోగం చేస్తున్నారు. మరి కొన్ని భారతీయుల పాత్రలను కూడా అక్కడ ఉన్న భారతీయులే నిర్వహిస్తారు.

బెర్లిన్ ఉత్సవం: బెర్లిన్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవం జూన్ 26 న ఆరంభమై జూలై 6 న పూర్తి అయింది. మనదేశం తరఫున, మొన్న రాష్ట్రపతి సువర్ణపతకం పొందిన బెంగాలీ కథాచిత్రం "సాగర్ సంగమే"ను, "రాధాకృష్ణ" అనే డాక్యుమెంటరీని ప్రదర్శించారు.

## వెండితెరపై లైకా మిత్రులు

అంతరిక్షంలో ప్రయాణించిన కుక్కల గురించి మాస్కోలో ఒక చలనచిత్రం నిర్మించబడుతూంది. దాని డైరెక్టరు నికొలై టిఖోనోవ్.

ఫిల్ము పేరు "చతుష్పాద రోదసీయాత్రికులు." ద్వితీయ సోవియట్ స్పుత్నిక్‌లో రోదసిలో ప్రయాణించిన లైకా పేరు ప్రపంచమంతటికీ తెలుసు. ఈ చిత్రంలో లైకామిత్రులైన 'కొద్ర్యావ్కా' 'అల్బినా' ఇతర చతుష్పాద యాత్రికులు. సోవియట్ వాతావరణ పరిశోధక రాకెట్లలో అంతరిక్షానికి వెళ్ళడం చూపబడింది. కుక్కలకు శిక్షణ యివ్వడం, లేబొరేటరీ పరిస్థితులలో వాటిని పరీక్షించడమూ యీ చిత్రంలో వివరంగా చూపించారు. రాకెట్‌లో వుంచబడిన ఆటోమేటిక్ కెమెరా తీసిన కొన్ని అపురూపదృశ్యాలు కూడా యీ చిత్రంలో వుంటాయి. 400 కిలోమీటర్ల ఎత్తున గురుత్వాకర్షణ శక్తిలేని పరిస్థితిలో ఒక కుక్క ప్రయాణించడం కూడా యీ దృశ్యాలలో ఒకటి. అటువంటి కష్టమైన ప్రయాణాలు జంతువులకు హాని కలిగించలేదు. ఉదాహర[illegible]బినా ఇటీవల రెండు పిల్లల్ని కూడా పెట్టింది. అల్బినా కుటుంబాన్ని కూడా తెరపై చూడవచ్చును.

ఉత్తమ చలనచిత్ర రచయితలకు అమెరికా సినీరచయితల సమితి ఇచ్చే బహుమతి ఈ ఏడాది, పాతికేళ్ళుగా యీ రంగంలో కృషిచేస్తున్న ప్రసిద్ధరచయిత ననలీ జాన్సనుకు లభించింది. ఈ బహుమతిని లారెల్ అవార్డు అంటారు. ననలీజాన్సన్‌కు లభించింది. ఈ బహుమతిని లారెల్ అవార్డు అంటారు. ననలీ జాన్సన్ వ్రాసిన చిత్రాలలో 'ది గ్రేప్స్ ఆఫ్ రాత్', 'ది మూన్ ఈజ్ డౌన్', 'కీస్ ఆఫ్ ది కింగ్‌డమ్', 'ది మేన్ ఇన్ ది గ్రే-ఫ్లానెల్ సూట్', 'ది త్రీ ఫేసెస్ ఆఫ్ ఈవ్' ఎన్నదగ్గవి. ★



కాన్స్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో గత సంవత్సరం ప్రథమ బహుమతి నందుకొన్న సోవియట్ చిత్రం "ది క్రేన్స్ ఆర్ ఫ్లయింగ్"లో ఒక సన్నివేశం.

# వార్తావరణం

### పెళ్ళికానుక

తమిళదర్శకనిర్మాత, రచయిత శ్రీధర్ తొలిచిత్రం 'కళ్యాణపరిసు' తమిళంలో సాధించిన విజయాన్ని పురస్కరించుకొని, ఆయన దానిని తెలుగులో పునర్నిర్మిస్తున్నారు. తమిళ చిత్రంలో పది నిమిషాల సేపు అతిథిగా పాల్గొని ప్రశంస లందుకొన్న నాగేశ్వరరావు తెలుగులో ముఖ్యపాత్రను నిర్వహిస్తున్నారు. రచయిత ఆత్రేయ.

### సినీనారదుడు

దుష్టపాత్రలూ, హాస్యపాత్రలూ నటించే జీవన్, నారద పాత్రధారిగా రజతోత్సవం జరుపుకుంటున్నాడంటే, కొంచెం ఆశ్చర్యం వేస్తుంది. మొట్టమొదటిసారి జీవన్ నారదుడు వేసినది 'ధ్రువ' అనే చిత్రంలో. 24 వ చిత్రం 'ఏకాదశి'. రజతోత్సవంకోసం అన్నట్లుగా ఇప్పుడు ఈ పాత్ర ధరిస్తున్న 25వ చిత్రానికి హీరోకూడ నారదుడు. దాని పేరు "దేవర్షి నారద్" భారతీ కళామందిర్ వారు ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

### భక్త అంబరీష

శ్రీ రామా పిక్చర్స్ పేరిట దర్శక నిర్మాత బోళ్ళ సుబ్బారావు తీస్తున్న పౌరాణికం 'భక్త అంబరీష' చాలవరకు పూర్తిఅయింది. ముఖ్య పాత్రను కాంతారావు నిర్వహిస్తున్నాడు. దుర్వాసుడు ఎస్. వి. రంగారావు. శ్రీరంజని, శాంతకుమారి, లక్ష్మీకాంతం, రమాదేవి, రఘురామయ్య, మిక్కిలినేని, చంద్రశేఖర్, కుటుంబరావు, పద్మనాభం, పెరుమాళ్ళు, వల్లం నరసింహారావు మొదలగువారంతా పాల్గొంటున్నారు. ఈ చిత్రానికి మల్లేశ్వరరావు సంగీతం సమకూర్చుతున్నారు. ఈయన సంగీతం కూర్చుతున్న మరో చిత్రం రేణుకామాహాత్మ్యం.

### కొత్త దర్శకుడు

నవలా నాటక రచయిత, పినిశెట్టి (దత్తత, నా చెల్లెలు) సినీ మాటల రచయిత శ్రీరామమూర్తి దర్శకత్వాన రవుతూ పిక్చర్స్ వారు తీస్తున్న సాంఘిక చిత్రం 'నిత్య కల్యాణం పచ్చతోరణం' నిర్మాణానికి జూన్ 29 న ఆంధ్ర నాటక కళా పరిషదధ్యక్షులు మోకా రంగయ్యప్పారావుగారు వీనస్ స్టుడియోలో ప్రారంభోత్సవం జరిపి దర్శక రచయితకు, నిర్మాత కృష్ణమూర్తిగారికీ శుభాకాంక్షలు తెలిపారు.

చలం, కృష్ణకుమారి, రాజశ్రీ, రామకృష్ణ అనే కొత్త నటీనటులిద్దరూ, గుమ్మడి, సి. ఎస్. ఆర్, రమణారెడ్డి, పేకేటి, అల్లు రామలింగయ్య, వల్లరామమూర్తి మొదలగువారు ఇందులో పాల్గొంటున్నారు. సంగీత దర్శకుడు పెండ్యాల.

### సిపాయి కూతురు

చందమామా (దొంగల్లో దొర) ఫిలింస్ వారి 'సిపాయి కూతురు' పూర్తికావచ్చింది. ఇందులో సత్యనారాయణ అనే కొత్త నటుడు ముఖ్యపాత్ర నిర్వహిస్తున్నాడు. సిపాయి గుమ్మడి; కూతురు జమున. ఇతరులు నాగయ్య, రమణారెడ్డి, రాజనాల, బాలకృష్ణ, సూర్యకాంతం మొదలగువారు. రచన కొవ్వలి. దర్శకత్వం పి. చెంగయ్య.

### నచ్చిన కోడలు

సుధాకర్ ఫిలింస్ వారి సాంఘిక చిత్రం 'వచ్చినకోడలు నచ్చింది' త్వరలోనే విడుదల చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. జమున, ఎన్. టి. రామారావు, హేమలత పాల్గొన్నారు. రచయిత ఆత్రేయ. దర్శకుడు యోగానంద్.

* * *

### మాస్కో ఉత్సవం

ఆగస్టు 8 నుండి రెండు వారాలు జరుగనున్న మాస్కో చలనచిత్రోత్సవానికి మన దేశం తరఫున సత్యజిత్ రాయ్ చిత్రం 'జల్సాఘర్'ను, 'మధ్యప్రదేశ్', 'ఆచార్య జగదీష్ చంద్ర' అనే రెండు డాక్యుమెంటరీలనూ ప్రభుత్వం పంపిస్తోంది.



# పుస్తక సమీక్ష

## వర్ణవిభేదాల సమస్య

"దేశం ఏడ్చింది." రచయిత ఎలాన్ పేటన్. అనువాదం: రెంటాల గోపాలకృష్ణ. ప్రచురణ: దేశి కవితా మండలి, విజయవాడ-2. [దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారమున ప్రకటితము.] వెల రు. 4.50

ఈ నవల చదవవలసిన అవసరం మనందరికీ ప్రత్యేకంగా ఉన్నది కేవలం గొప్ప గ్రంథమనే కాక, ఆఫ్రికన్లకు మన మెంత దూరంగా ఉన్నామో తెలిసికోటానికైనా సరే. సాధారణంగా మనకు ఆసియా దేశాలలోని విషయాలు తెలుసుకోవాలని ఉన్న ఆసక్తి ఆఫ్రికన్ల విషయంలో లేదనిపిస్తుంది. ఈ మధ్యనే స్వాతంత్ర్యం సాధించిన మనకు వీరి విషయంలో ప్రత్యేకమయిన బాధ్యత ఉన్నది [బాండుంగ్ సమావేశాన్ని ఖండించే వారు కూడా జాతి విభేదాల ప్రభావాన్ని గుర్తించ గలుగుతున్నారు. ఆఫ్రికన్లవలె మనం కూడా "నల్లజాతి"వారమనే దాన్ని బట్టే కాక, వారు కూడా స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నందుకైనా వారితో సాన్నిహిత్యాన్ని ప్రకటించాలి. ఇంకొక విషయం - మన వర్ణాశ్రమ వ్యవస్థ 'ఎపార్థాయిడ్'కి ఏమాత్రం తీసిపోదు.]

'జార్విస్ అనే శ్వేతజాతి భూస్వామి కొడుకు జోహాన్సబర్గ్‌లో ఉండి ఆఫ్రికన్ల (నీగ్రోల) కోసం కృషిచేస్తూ ఉంటాడు. ఈ జార్విస్ గ్రామం పక్కనున్న ఒక నీగ్రో ఫాదరీ కుమారుడు కొడుకు జోహాన్సబర్గ్‌లో ఉన్న జార్విస్ కుమారుని ఇంట్లో దొంగతనానికి చొరబడి ప్రమాదవశాత్తు అతన్ని కాల్చి చంపివేస్తాడు. అదే సమయంలో ఈ నీగ్రోఫాదరీ జోహాన్సబర్గ్‌కి తన చెల్లెలిని, కొడుకును వెతుక్కుంటూ వస్తాడు. జార్విస్ కూడా ఈ హత్యానంతరం జోహాన్సబర్గ్‌కి వచ్చి తన కొడుకు చేస్తున్న కృషిని అర్థంచేసుకొని తన దృక్పథాన్ని మార్చుకో గలుగుతాడు. ఆఫ్రికన్ల దృక్కోణం నుంచి చూడటానికైనా తీరిక లేని ఇతను వారికోసం ఏ కొంచమైనా చేద్దామని సంకల్పించుకొని హంతకుని తండ్రి అని తెలిసినప్పటికీ ఫాదరీతో స్నేహం చేస్తాడు. జాతివిభేదాలకు సంబంధించిన విషయాలను చర్చించుకొనని ఫాదరీ కూడా ద్వేషం లేకుండా ఉండగలిగితే చాలనుకుంటాడు.

గ్రంథకర్త దక్షిణ ఆఫ్రికా లిబరల్ పార్టీ ఉపాధ్యక్షులు కనుక కథలో నీతి స్పష్టంగా చెప్పారు. హత్య కాబడిన జార్విస్ కొడుకు ఇలా వ్రాస్తాడు.

"మన వ్యవస్థ నాగరికత కాదు(?) ఇదొక (ఆదిమవాసుల పూర్వపు జాతి పద్ధతి) మంట కలిసి పోయినది అంతేకాని మన నాగరికతకు మారదగిన నీతి ఒకటి ఉన్నది; అది, మన క్రైస్తవ నీతిని, సంప్రదాయాన్ని, ఆచారాన్ని [illegible] ఏర్పడిన సమస్య తేలికైనది కాదు. కాని, "మనం క్రైస్తవులము అనుకున్న ఎన్నటికీ నైతిక సమస్యలనుంచి తప్పించుకోలేము," "నాగరిక ప్రాభాతమునందు మనం ఉన్నాము. కాని ఆ దక్షిణ ఆఫ్రికాలో ఉండాలని మనం కోరటం లేదు" ఆఫ్రికన్ [illegible] ఏదిగా ఉండాలో చెప్పాను "సత్యాన్ని ప్రేమించడం... నాకు తెలియదు చెప్పాలి"... కాని "మేము తెల్లవాళ్ళు నల్లవారి నుంచి అంతా వినదగిన కొంతవరకైన బాకీ తీర్చుకోగలము.." "నాకు ఉన్నది ఒకటే భయం. అది ఏమిటి అంటే, వారొకనాటికైనా తెల్లవాళ్ళని ప్రేమించటం మొదలుపెట్టే సరికి మనం ద్వేషించటానికి పూనుకుంటామేమోనని"

అనువాదంలోని కర్తవ్యల అందాన్ని తెలుగులోనికి తేవటం కష్టమే అయినప్పటికీ కనీసం తప్పులు లేకుండా చూసి వుండవలసింది. ఉదాహరణకి: "Inarticulately he stroked her face" కు "ఆమె ముఖాన్ని అస్పష్టంగా నేనో నిమిరాడు" అని ఒక చోట. మరొక చోట "Mortuary"కి "[illegible]" అని; మరొకచోట "The Coffins slid soundlessly into the furnace" కు "శవపేటికలు చప్పుడు కాకుండా మెల్లగా నిప్పులో ఉంచారు" అని. 299 వ పేజీలోని సంగీత పేరా మొదటి వాక్యాలు మూలానికి విరుద్ధంగా ఉన్నాయి. "నిరుత్సాహం" అనే మాట గ్రంథంలో అక్కడక్కడ కొంచెం అసందర్భంగా వాడబడి ఉన్నది.

ఇటువంటి లోపాలు ఎన్ని ఉన్నా ఈ పుస్తకం అందరూ చదవదగినది.

## 'సొట్టొ వోచే'

## [SOTTO VOCE]

[ఆంగ్ల వ్యాససంపుటి, రచన: "విఘ్నేశ్వర" (శ్రీ ఎస్. రఘునాథన్) ప్రచురణ: [illegible] D. జి. పాల్ అండ్ కో, 4, ఫ్రాన్సిస్ జోసెఫ్ వీధి, మద్రాసు-1. డెమ్మీ అక్టేవో సైజు 352 పేజీలు, మేలిరకం ప్రతి: వెల: రు 5 లు; మామూలు కాగితం అట్ట ప్రతి: వెల: రు 4 లు.]

శ్రీ భాషా సుబ్బారావు సంపాదకత్వాన ఇదివరలో వెలువడిన ఆంగ్ల వారపత్రిక "స్వతంత్ర" పాఠకులకు, ఇప్పుడు వెలువడుతున్న "స్వరాజ్య" పాఠకులకు 'సొట్టొ వోచే' అనే శీర్షిక చిరపరిచితమైనది. వర్తమాన ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిణామాలను, తదితర విషయాలను విమర్శిస్తూ వారం వారం ఒక్కొక్క వ్యాసం 'విఘ్నేశ్వర' అనే మారు పేరుతో వ్రాసి ఈ శీర్షికను నిర్వహిస్తున్న శ్రీ ఎస్ రఘునాథన్ పేరు కూడా పాఠకులకు సుపరిచితమైనదే. ఇది 1946-47-48 సం॥లలో వ్రాసిన దాదాపు నూటఅరవై చిన్న వ్యాసాలను చేర్చి ప్రచురించిన గ్రంథం.

శ్రీ ఎస్ రఘునాథన్ "హిందూ" పత్రికలో చాలా కాలం ప్రధాన సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించి పత్రికారచనలో విశేషానుభవం గడించినవారు. ఈ గ్రంథంలో పొందుపరిచిన వ్యాస పరంపరను చదువుతుంటే ఆంగ్లభాష మీదా, సారస్వతం మీదా రచయితకున్న అసమాన అధికారం ద్యోతకమవుతుంది. సజాతీయమైన మత సత్సంప్రదాయాలంటే వారికి వున్న గౌరవాభిమానాలు, నేటి సమాజం ఎదుర్కొంటున్న వివిధ క్లిష్ట సమస్యల మీద వారికి వున్న స్థిరమైన భావాలు ఈ సంపుటికి రయినది స్వయంగా వ్రాసుకున్న [illegible] పీఠికవల్ల స్పష్టమవుతున్నాయి. సమాజంలో మానవ వికాసం, అభ్యుదయం అన్నవి క్రమానుగతమైన సహజ పరిణామం ద్వారా రావాలిగాని, బలవంతంగా చేసే శాసన నిర్మాణంవల్ల రావని రచయిత విశ్వాసం.

ఏ ఒక్కటి సాధారణంగా [illegible] పేజీలకు మించకపోయినప్పటికీ ఆ చిన్న పరిధిలోనే ప్రతి వ్యాసానికి ఒకవిధమైన నిండుతనాన్ని, పొంకాన్ని సాధించటం రచయిత సహజసిద్ధమైన ప్రజ్ఞకు [illegible]

ఆంగ్లభాషాభిమానులు, కళాశాలల విద్యార్థులు, అధ్యాపకులు తప్పక [illegible] పఠించదగిన పుస్తకం. గ్రంథం [illegible] దక్కని టిప్పణం కూడా చేర్చివున్న [illegible] పఠనం అంత కష్టం కాదు. త్వరలో మిగతా వ్యాసాలు కూడా శ్రీ ఎస్. రఘునాథన్ ఇదే విధంగా పుస్తక రూపంలో ప్రచురిస్తే బాగుంటుంది. —[illegible]

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad



బెలూన్‌వాలా

—ఫొటో : డి ఎస్ అంబూరావు.

# తిరిగి ఆశ్చర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది!



పిల్ ఫర్-ప్రూఫ్ మూతతోను, క్రొత్త ఎఱ్ఱ లేబిల్ తోను యిప్పుడు సరఫరా చేయాబడుచున్నది.

వాటర్‌బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు చిన్నలు పెద్దలు అందరూ కూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటిలేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్‌బరీస్ కాంపౌండ్‌లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును

వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు పడిశములు, శ్వాసకోశపు దుర్బలతలను నివారించును వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు



ఇప్పుడు వాడుకలో లేని ఎఱ్ఱ రాపర్

## ఆరోగ్యమునకు హితవైన

# వాటర్‌బరీస్ కాంపౌండ్